# మ ధు ర శ్రీ




భ క్త క వి

బాచిమంచి శ్రీహరిశాస్త్రి

శ్రీ మత్పరదేవతాయైనమః.

# పీ ఠి క

శ్రీ బాచిమంచి శ్రీహరిశాస్త్రిగారు – వారిచే రచింపఁబడిన అనేక ఘట్టములలోని పద్యములను నాకు వినుపింపఁగా నేను వినుట తటస్థించినది. ఇంతేగాకుండా వీరి రచనలను అప్పటప్పట – కొన్ని పత్రికలలో సైతం చూచినవాడనై యుండుటచే నీనాటికన్నను కొంత ఆనుపూర్వికంగానే వీరి కవితతో నాకు పరిచయం కలదు. వీరు కవితావంశంలో జనించినవారు. ఆధునికమయిన ప్రగతిశీలకత్వంతోపాటుగా వీరి కవితలో అనూచానములయిన పూర్వకవితా మర్యాదలున్ను సర్వేసర్వత్ర గోచరిస్తూ ఉండును. తన్మయత్వంగల ధార కావడంవలన స్వతః అభిరుచులలో ఎక్కడ వెదకినా హత్తుకుపోయే భక్తి గోచరించడవల్లననే కాఁబోలు కొందఱు వీరిని భక్తకవిగా నిర్దేశించియున్నారు. ప్రకృతిసిద్ధమయిన వారి వడవడికలో సైతం – విద్యా వినయసంపన్నత్వములు వెల్లివిరియడంద్వారా పై బిరుదమున్ను సార్థకమయినట్లే నాతలంపు. వీరి రచనలలోని మఱొక విశేషమేమిటంటే! పదజాలంకోసం వెతుక్కోవడంకన్న సూటిగా, తేలికగా భావాన్ని వ్యక్తీకరించడానికే

ఎక్కువగా ప్రయత్నించడం ఒకటి నాకు బాగా కనిపించింది. దీని ఆవశ్యకతనుగూర్చి నేను వివరించనక్కఱలేదు. ఇది యెంత ఎక్కువగా ఉంటే అంత ఎక్కువ భావి - కవికి కవితాలోకంలో ఈనాడు ఉన్నదనేది నిర్వివాదవిషయమేగదా? కావున, వీరికి ఆ యీ శక్తులద్వారా, చిరాయురారోగ్య భోగభాగ్యాది శక్తిమంతమైన కీర్తి యేర్పడుగాతమని హృదయపూర్వకంగా వాంఛిస్తూ కామేశ్వరిని ప్రార్థిస్తూ విరమిస్తున్నాను.

శు భం భ వ తు.

క్షీరసాగరం బిల్డింగ్సు
విజయవాడ
4—6—50

వి ద్వా న్
చె ళ్ళ పి ళ్ళ దు ర్గే శ్వ ర శా స్త్రి
శతావధాని



శ్రీ

# అభిప్రాయములు

★

శ్రీ మత్పర దేవతాయై నమః

శ్రీహరి శాస్త్రి! నీ కృతి ప్రసిద్ధికి నెక్కి రహించుఁగాక! నీ
కా హరి ఆత్మనామధరుఁ డంచభిమానముఁ జూపుఁగాక! సం
దేహము లేదు నీ గృహిణి దీర్ఘతరాయువుఁ బుత్త్రుఁ గాంచి నీ
గేహము శోభిలన్ వఱలి కించఁ దొలంచునుగాక వీఁకమై. ౧

శ్రీరాముండు పునర్వసు
తారన్ జనియించె నీదు తనయుం డటుపై
తార జనియించె నీ సుతు
నా రాముం డోముఁగాత మాయుఃప్రదుఁడై. ౨

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

...ఇతని ధార ధారాళముగా తత్సమపదభూయిష్టముగా
నుండును. సంస్కృతమునందుగూడ నాంధ్రరచనకు వలయు

నంతటి సాహితిని చదివికొని సంపాదించెను. క్రమముగా మంచి కవి కాఁగలఁడని నానమ్మిక. ఇతనికి భగవంతుఁడు సర్వదా తోడ్పడుఁగాక!

క్షీరసాగరం, గవర్నరుపేట
బెజవాడ. కృ॥ డి॥
19—9—46

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
శతావధాని



శ్రీ బాచిమంచి శ్రీహరి శాస్త్రిగారి కవనము కొంత భాగము వారు వినిపింపఁగా వింటిని. మంచి ధారగా సాఁగెడు కవిత్వము. అస్మద్గురువర్యులు శ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారే వీరి కవితను ప్రశంసించిరి. పద్యములు ధారాళముగా వ్రాయఁగల శక్తి వీరికి సమృద్ధిగా నున్నది. సమాసములు కూడ మృదువుగా నున్నవి.............

విజయవాడ
4—9—53

ఇట్లు,
విశ్వనాథ సత్యనారాయణ.



ఒకమహా సుకృతము ఫలోన్ముఖము గాక
కావ్య తాత్పర్య మెవనికిఁ గలుగనేర్చు?
ప్రాక్తనార్జిత సుకృత మీ భక్తకవికి
కల దనంగ ప్రమాణ మీ గ్రంథ మొకఁడె.

వరలక్ష్మి ప్రెస్
20—4—53.

బెల్లంకొండ రాఘవరావు

♦ ♦ ♦

ఓం.

సుదినము నేఁడు నిక్కముగ సోదర నీ విట కేగు దెంచుటన్
ముదమును గల్గఁజేసినది ముద్దులుగుల్కెడి నీదు కైత నిన్
సదయత నేలుగాక యనిశంబును శ్రీహరి; నీ కవిత్వ మ
భ్యుదయము నొందుగాక నిల బూర్ణశశాంకుని యట్లు శ్రీహరీ!

గొడవర్రు అగ్రహారం
14-10-1947

ఇట్లు,
జంధ్యాల వేంకటేశ్వర్లు

♦ ♦ ♦

శ్రీవారి వ్యాసాదులు త్రిలిఙ్గ మున్నగు పత్రికలలోఁ జూచి యానందించు చున్నాను.

కాకినాడ
2—12—'46

కొట్రి శ్యామల కామశాస్త్రి
'ఆంధ్ర విద్యావాచస్పతి'

♦ ♦ ♦ ♦

కమ్మని జాను తెన్గునుడికారపు సొంపులు నీదు కబ్బమం
దిమ్ముగ నాట్య మాడునుసుమీ సుకవీశ్వర! పాలవెల్లిలోఁ
బ్రమ్మిన వేడ్కఁ లేచెడి తరంగములట్టులు నీ కవిత్వ మా
ర్గమ్ముల నేడ నేర్చితివి! రత్నపుతున్కలు నీదు పద్యముల్.

పోతనగారివోలె మధుమోహన శబ్దరసాల శాఖపై
ప్రీతిగఁ గానవాహిని స్రవింపఁగఁజేయు పికంబ వీవు, నీ
కైతలు చూడచూడ కుతుకంబు జనించు కవీంద్ర! యెప్డు మా
చేతములందు నిన్ను దరిశించుట పండువు మాకు శ్రీహరీ.

వీరంకిలాకు
8-1-53

తాడికొండ
భోగమల్లిఖార్జున అయ్యవారు.

♦ ♦ ♦ ♦

శ్రీ బాచిమంచి శ్రీహరి శాస్త్రిగారు తమ కృతులను కొన్నిటిని నాకు చూపినారు. కొన్నిటిని వినిపించినారు. వీరికి చక్కని ధారాశుద్ధి కలదు. యువకులు. కావ్యవస్తువు కుదుర్చుకొని నవీన వాతావరణానుకూలంగా రచన లారంభించితే చక్కని భాషాసేవ చేయగల సామర్థ్యము వీరికి కలదని నాకు తోఁచినది. సర్వేశ్వరుడు వీరి ననుగ్రహించి తోడ్పడుగాక!

మకాం, పడమటలంక
17—1—48

గాడిచర్ల హరిసర్వోత్తమరావు
ఆం. దే. గ్రంథాలయ సంఘాధ్యక్షుడు



భక్తకవి శ్రీ బాచిమంచి శ్రీహరి శాస్త్రిగారి పద్యములు ధారాళమగు నడకలోఁ జెలువొందు చుండును. చెత్తపదములు, ఊతపదములు మున్నగువానికి వీరి పద్యములలోఁ దావుండదు. భావానుగుణ్యమగు పదజాలముఁ గూర్చు నేర్పు వీరికి స్వతస్సిద్ధముగా నేర్పడినట్లు తోఁచును.

మదరాసు
15-1-53

"విద్వత్కవిభూషణ"
వేదం వేంకటకృష్ణ శర్మ.



బ్రహ్మశ్రీ బాచిమంచి శ్రీహరిశాస్త్రిగారికి :—

వంగడంబు చెలుల బలగంబు జదువును
గొనము దైవభక్తి తినఁగఁబెట్టఁ
గలుగు కలిమి, లెస్స కలిమి శ్రీహరిశాస్త్రి
సుకవి యౌట మంచి సుకృతి వైతి.

నేరువరాని మంచిని జనించితి మంచి నెఱుంగఁజెప్పినన్
నేరుపునన్ గ్రహించెదు మనీషివి యైతివి సత్కవిత్వపుం
గూరుపఁజాలు లక్షణముగొంటి వికన్ సుకృతుల్ ప్రజాహితం
బారయుచున్ రచించి కను మభ్యుదయంబు నితోఽధికంబుగన్.

మకాం :
విజయవాడ
5-9-50

భవదీయుఁడు
కొప్పరపు సీతారామప్రసాదరావుకవి
శతావధాని

శ్రీహరిశాస్త్రి వాణికృపచే రచియించిన ఖండకావ్య సం
దోహముఁ గంటి, నాత్మఁ బరితోషముఁగంటిఁ దివ్రిలిఙ్గ భారతీ
మోహన రత్నహారము, లమూల్యకథా కవితావిధాప్రథా
గేహములన్ సృజించి కవిగేయుఁడుగా నితఁ డేసరేఁగుతన్.

అప్పికట్ల
(*Via*)బాపట్ల
28-9-48

ఇట్లు,
తుమ్మల సీతారామమూర్తి చౌదరి.

మధురకవులు శ్రీ హరిశాస్త్రిగారికి ఆశీస్సులు -

మీ కవిత్వమునుగుఱించి నా చెప్పుమాటలు పెక్కేల? కవిత్వ మనునది ఆమూలచూడము వెల్లుబుకుచున్నది. రససిద్ధుఁడైన కవి పుట్టును, పుట్టింపఁబడఁడు.

మీరు మొదటికోటికిఁ జెందినవారు. మీ ఖండికలన్నీ శ్రద్ధమెయిఁ జదివితిని. అందుచేతనే పెక్కేల అనవలసివచ్చినది. ముందుముందు మీకలమునుండి మధువాహిని ఊటలూరును. కరుణైకతానమయిన భక్తి మీ కవితలో దొణికిసలాడుచుండును. ఇది భావనాబలమునకు మెఱుఁగువెట్టును. ఇంతేల మీరు వర్ధిష్ణువులు; నిరంతరము వ్రాయుడు.

నిడుబ్రోలు
10-4-49

మీ
ఏటుకూరి వేంకట నరసయ్య



ఆర్యా! వందనములు,

మీరు పెద్దన పోతనాదులపై వ్రాసిన పద్యములను చూచితిని. కవిత్వము మృదుమధురమై, హృదయంగమముగా నున్నది. భావములు మంజులములు. ధార సాఫుగా నున్నది. పట్టు విడువని పరిశ్రమచేత మీకవిత ఆంధ్రభాషాయోష కలంకారమై వెలయగలదు.

గుంటూరు
7-1-48

చిత్తగించవలెను,
జి. జాషువ

శ్రీరామ చంద్రాయ నమః

కవితాసుందరి కైవసంబయిన భాగ్యం బబ్బుట నీకు వలన్
సువిశేషంబగు నాకృతిం గృతి నొసంగంగాఁ గనన్ సాజమే
యీవు నవ్యాప నపాపమార్గమున నీ యాఖ్యన్ రహింపంబొల్చు శ్రీ
ధవు నారాధనఁ జెల్వుఁ జేసితి వహో! ధన్యుండవై శ్రీహరీ!!

విజయవాడ
15-10-50

ఇట్లు,
దోమా వేంకటస్వామి గుప్త



ఈ కవిగారి ఆంధ్రకవిత్వము ప్రాచీన, నవీన పదసమన్వితమై పదహారణాలు ఆంధ్రుడా! అనునటుల కనంబడుచున్నది. వీరి ఖండ కావ్యములు భక్తిసమన్వితమై భాష ధారాశుద్ధి కలిగి; ఆంధ్రకవియొక్క పేరునకు తగినటుల కనంబడుచున్నది. గాన వీరు నిక్కమైన ఆంధ్రకవిగా వర్ధిల్లి, భక్తకవిగా భక్తిప్రాశస్త్యము వహించి ఆంధ్రకవిత్వమున యశస్సు గణించగల రని విశ్వసించుచున్నాను.

ఇట్లు
కోన ఆదినారాయణ
'ఆంధ్ర పత్రికా విలేఖరి'

కృష్ణాపురం
20-1-1951



బాచిమంచి శ్రీహరిశాస్త్రి

'కిన్నెరసాని' నా వన్నెలాడినిఁ దెచ్చి
కులికించెఁ దెలుఁగుల పలుకలందు
మధుర మంజులమైన కథ లెన్నియో యాంధ్ర
వారపత్రిక కిచ్చి పేరుఁగాంచె

'ఆంధ్రపౌరుషంపు' టాదర్శమార్గముల్
భరతసుతుల కెఱుకఁబఱచె మిగుల
ఘనుఁడు 'విశ్వనాథ కవి సత్యనారాయ
ణా'ఖ్యు మదినిఁ దలఁచి యభినుతింతు.

తిరుపతి వేంకటేశ కవిధీరులలో నొకఁడైన వేంకటే
శ్వరునకుఁ బుత్రుఁడు న్మిగుల సజ్జనుడట్టిడు దుర్గయాఖ్యుఁడుక్
మఱియు శతావధాని-కడుమాన్యుడు పీఠిక వ్రాసి పాత్రముఁన్
గరము వెలుంగఁజేసిరి మనఃపరితోష మెలర్పునట్లుగన్.

ఉన్నవియు లేనివియు వ్రాసి నన్నుఁ జాల
ప్రస్తుతించియు మిత్రుఁడై బఱఁగు నట్టి
'తాడి కొండాన్వయు నశ్రది' దలఁచి మిగుల
సజ్జనుని 'మల్లిఖార్జును' సన్నుతింతు.

ఏవో పద్యము లల్లి పంప మది నెంతే మోదమున్ జూపి; వి
ద్యా వైశద్య మెలర్ప స్వీయమగు వార్తాపత్రిక న్వేసి నా
భావంబందు ముదంబుఁ గూర్చిన మహాపాండిత్య వారాన్నిధిన్
'వావిళ్లాన్వ'యు 'వెంకటేశ్వరు'ని సంభావింతు డెందంబునన్.

ముద్దు లొలుకునట్లు ముద్రించి పొత్తమ్ము
నాకు సంతసం బొనర్చినట్టి
ప్రథిత చరితు "సుబ్బరాయుని" వరలక్ష్మి
కరుణ మెసఁగ మనుచుఁగాత సతము.

వరము లే దీతని కరమున కను కీర్తి
గొన్న 'పిళ్ళారయ్య' కూర్మితాత
తల్లియుఁ దండ్రియై తనయులఁ బోషించి
నట్టి 'లక్ష్మయమ్మ' నాయనమ్మ
'కోటయ', 'సుబ్బయల్' కోవిదు లందు సు
బ్బయగారు తండ్రియై పఱఁగు నాకు
రాజద్యక్షుఁడు ధర్మరాజు 'జొన్నలగడ్డ
రామచంద్రయ్య' నా మామగారు

కలతలు లేని మేల్కాపురం బొనరించి
వెలసె 'వేంకటలక్ష్మి' పెద్దతల్లి
సార్థకాహ్వాయురాలు 'సావిత్రి' యను పేరఁ
దనరు చిన్నది నాదు ధర్మపత్ని

కడుపునిండ ప్రేమకల దొడ్డయిల్లాలు
మాట వీ తెఱుఁగని మంచితల్లి
కలదు 'రాజ్యలక్ష్మి' గారాబు జనయిత్రి
భక్తకవి యనంగఁ బఱఁగువాఁడ.

వసుధలో "బాచిమంచి" సద్వంశ మమరు
చదివినది శబ్దశాస్త్ర ప్రశస్త విద్య
పేరు "శ్రీహరిశాస్త్రి" కవీశ్వరుఁడను
కలరు బిడ్డలు 'రామ' 'లక్ష్మణు'లు నాకు.

# శీర్షికలు



పరదూషణ

గ్రంథాలయ ప్రబోధం

భరతమాత

సంక్రాంతి

పటేలుబాబు

శకసమాప్తి

బాపూజీ లేడా?

కవిబ్రహ్మ

ఆంధ్రకేసరి

భాషోద్ధారకులు

కవిప్రశంస

ఉగాది

న్యాయమూర్తి

హిందూసుందరి

ప్రకృతీ ప్రశంస

మిష్టర్ వేపా



శ్రీ:



శ్రీరామ శ్శరణమ్ మమ.

# ఆ త్మా ర్ప ణ ం

'శ్రీరామా'! యని నిన్ను వేడెద ప్రభూ! చిత్తంబులోనుండి, నన్
'రారా! నాయన! నిన్నుఁ గాతు ననుచున్ రంజింపఁగాఁ జేసి, నీ
కారుణ్యామృత ధారలన్ బఱపి నన్ గాపాడి నట్లైన నీ
వే రక్షింపఁగఁ జాలువాఁడ వనుచు న్నే నెంతు రామప్రభూ!



•

## అ భి భా ష ణ

కమ్మని కావ్య మల్లుటకుగా నొకకొంత శ్రమించి యింక నా
కొమ్మ వివాహమెట్టు లని కొంత మదిన్ దిగులొంది యెట్టులో
నిమ్మహిలోన నొక్క వరు నేరి యెటో ముడివైవ నేమి లా
భమ్మగు, దద్రసమ్ము గనువారలు లేని జగమ్మునందునన్.

కవి యన నెవ్వడో? యతని కావ్య మదెట్టిదో! దేనికోస మా
కవియటు కావ్యముల్ గిలుకు కాంక్ష యొనర్చునో! పూర్వమిట్టి స
త్కవి యొనరించు కబ్బముల గౌరవ మెట్టులఁ గ్రాలియున్నదో
ఎవరెఱుఁగంగ నేర్తు రిపు డిట్టివి పల్కన నవ్వరే! జనుల్.

మొకమున కొక్క రీతిగ సముజ్జ్వలమై విలసిల్లువాణి యుం
చొక సుకవీంద్రుఁడే పలికి యుండె యటే మన తెల్గునేలపై
రక రకమైన కైతలు విరాజిలుచున్నవి మెచ్చువారిలో
నొకరును లేరె! కాల మిటు లుండ నిఁకేమి యొనర్పనయ్యెడిన్.

మెచ్చెడివారు లేరనుచు మే మెపుడు న్విడనాడఁబోము మ
మ్మచ్చులపాలుజేసిన మహోజ్జ్వల సత్కవితావధూటినిన్
సచ్చరితుల్ రసజ్ఞులు విశాలమనోజ్ఞ విశుద్ధచిత్తు లీ
పచ్చనిగడ్డ నెడ్డ యొకపట్టున జన్మము నందకుందురే!

సన్మానంబులు నాకు లేవనెడి యీర్ష్యా ద్వేషభూయిష్ఠమౌ
నున్మాదంబున గాదు ఈ పగిది మొఱ్ఱో యంచు వాక్రుచ్చుటల్
న న్మోహించిన వాణిలోఁ గల యనన్యంబైన మాధుర్యముం
గన్మా యం చని తెల్పు నట్టివివి నా కైమోడ్పుపద్యావళుల్.

కోరినయంతనే యశముకు-డద! ఎన్నివిధాలఁగోరఁ జే
కూరవు సంపదల్ మనుజకోటి కి దెల్ల రెఱింగినట్టిదే
నేరుపుతోడ సత్కవి వినిర్మితముం బొనరించు కబ్బపుం
గూరుపులోని నేర్పెరుగఁగోరె డిదే మిము గోరెదన్ మదిన్.

ఎదురగునప్పు డాసను కవీంద్రునికిన్ దన కేలొసంగుచున్
మదకరిరాజ మెక్కనటు మాన్యతఁగూర్చు కళాప్రియత్వ మీ
యదనున మృగ్య మయ్యెనే! మహాత్ములు పుట్టిన గడ్డమీఁద నీ
హృదయము లేని మానవుల నెట్లు సృజించితి వమ్మ తల్లిరో!

కొంతకుఁ గొంత నాఁటె మనుకొంటిమి కాంగ్రెసు పాలనంబునం
దంతకు మున్నె సున్న యెటులాడిన మా కవితాకుమారి వా
సొంత మహాళ్ళలోన పరిశుద్ధమనస్కుల పంక్తిభోజనం
బంతును బొంతు నందని మహత్తర గౌరవముల్ లభించునే!

కన్నులు లేవు మాకు జయఘంటలతోడ కవీంద్రకోటి వి
ద్వన్నుత దివ్యకావ్యపు వివాదములోపల కంచుఢక్కలన్
సున్నముఁ జేయు ఘట్టముల సోయగము న్గనునట్టి మేటి సం
పన్నతఁ జూడ నిట్టివి తపంబులు వేయి నొనర్పఁగూడునే?

రాజులు మోయు పల్లకుల రాజిలు నీ ఘనవైభవంబు లీ
రోజున మాయమయ్యెనె? పరుండిరి మా తెలుఁగయ్య లందఱున్
మోజునుఁ జేసి నీ స్మరణము న్బొనరించుచు నుంటి మిప్పు డీ
గాజులబేర మెవ్వరికిఁ గావలె నో కవితా సరస్వతీ!

గాజుల బేర మన్న నది గౌరవమే యటుగాక తృప్తిగా
భోజన మిచ్చు నీదుపదముల్ భజియించెడి మమ్ము జొంట్ల కా
భోజన మట్టు లుండ మఱి పుట్టదు చిట్టెడు పచ్చిగంజియున్
రాజులు లేని లోకమున రాజిలు నెట్లు కళాభిమానముల్!

పిచ్చిగ వాగునట్టి యొక పిచ్చిమనుష్యునిఁ జేరఁ దీసి 'కీ'
యిచ్చిన కొంతసేపు ముద మిచ్చుటఁ జూడమె? యట్టిమాది రే
పిచ్చికవిత్వమో పలుకు పేదకవీశ్వరు జేరఁదీసి 'కీ'
యిచ్చు రసజ్ఞుఁ డేఁడి? కనుపింపఁ డొకండు తెలుంగుగడ్డపై.

ఏనుఁగు నెక్కువాఁ డొకఁడు హేళనఁ జేసెడివా డొకండు బిం
కాన నెటో స్వకీయ హితకాండము లేపి యఖండమైన స
న్మానము లంది పొంగెడి యనాథ యొకండును గాక నీ స్థితిన్
మానసమందు గుర్తెఱుఁగు మాన్యులు లేరుగదమ్మ తల్లిరో!

అసిధారావ్రత మూని సత్కవులు కావ్యాలాపనల్ సల్పు నా
పస నూహింప శరీర మిప్పుడు గగుర్పాటొందు తత్తత్కళా
వ్యసనం బిప్పుడు మచ్చుకైన గనుపింపన్ రాద, ఈ రీతిగా
ససి గోల్పడ్డ ప్రపంచమం దెటు కళాసంపత్తి దైవారెడిన్!

కటిక కసాయివాండ్రు తురకల్ కనిపెట్టిరి సత్కవిత్వపున్
బటిమ వెలార్చు పద్యశుని 'బండితరాయల' కావ్యగానమున్
దటుకున నేఁడు విజ్ఞతఁ దనర్చు మదీయులు తెల్గుసోదరుల్
కట కట గుర్తెఱుంగరు వికా వికలయ్యెఁ గళాభిమానముల్.

వింతప్రపంచము న్గనుచు వేసటనందిన నా కలం బిటుల్
గంతులు వేయఁగాఁ దొడఁగె కమ్మనిత్రోవఁ దొలంగి కొంతలోఁ
గొంతయు నేని సమ్మదము కూడిన నిట్టిపథంబుఁ జొచ్చునే
నింతకు మాట లాడగ పనే మిది 'బ్రహ్మముగారి' కాలమా.

మప్పిదమైన ధోరణు లమర్చి 'సెబా' సనునట్లు క్రొత్తఁగా
నెప్పటి కప్పుడే పదము లేరుచు ధ్యానము నించి పద్దెముల్
చొప్పడఁజేయు సత్కవుల సూరత హీనతఁజెంద దెబ్బయై
గుప్పెడు గుండెతో రసికోటికినై పరువెత్త నే మగుఁణ?

మొగలు దర్బారులో ధగధగ ప్రభలచే
నర్తించినది 'జగన్నాథు' పలుకు
సమ్రాట్టు మూఁపుపై స్వారిఁజేయుచు మేటి
నగలందినది 'పెద్దనార్యు' మాట
స్వర్ణాభిషేక సంపదచేత నుప్పొంగి
నాట్య మాడినది 'శ్రీనాథు' వాణి
చాళుక్యనృపుల ప్రోత్సాహాతిశయముచే
నన్నయ్యకలము విన్నాణ మొందె.

కప్పురపు వీడెములతోడ ఘనత నంది
బాగుగా మేటియూయేల లూగి యూగి
గుంపులో నాఁటి రసికులఁగూడి తొల్లి
విహారణముఁ జేసితివి సందెవేళలందు

ఎందఱు సత్కవీశు లిటు లెన్నివిధాల వగర్చినన్ మహా
నందముతోడ నా నృపు లొనర్చెడి యక్షర లక్షదానముల్
కందుమె! తత్కళాభిరుచి గాంచఁగ నౌనె యెటో గతించె నా
సుందరమైన కాల మిఁక జూడ మికెన్ని భవంబు లెత్తినన్.

దేబెలు కొంద ఱివ్వి చలిదీరిన పల్కులుగాఁ గణించినన్
'బాబా!' యటంచు కుందక యనాదరణం బొనరింతు మింక మా
బాబులు సత్కళానిధులు మాన్యులు మెచ్చిన జాలకున్న గా
రాబు కవిత్వసంపద తరాలు తపం బొనరింపఁ గూడునే!

ఉన్నవి కావ్యపోషణ మహోత్సవముల్ మఱి యెంకిపాటలన్
బన్నది సత్కవీశ్వరుల పాలయి స్రుక్కె మహామహోజ్జ్వలా
భ్యున్నత సాహితీమణికిఁ బూజలు లేవ! యిటుల్ వచించు నా
కన్నులలోన నింత పాడికారముఁ జల్ల యతింతు రమ్మరో.

నర్మ గర్భితమైన విన్నాణ మైన
సాహితీలక్ష్మి యింటింట సాఁగు నాఁడు
కళలకై ప్రాణములు పంచు ఘనులు గల్గు
కాలమును జూచు భాగ్యము కల్గదయ్యె!

జాబులందునఁగూడ సత్కవిత్వము వ్రాయు
మోజు లెల్లను నేఁడు పూజ్యమయ్యె
వాణితో సరసాలు వచియించు సత్కవీట్
తేజంబునకు నేఁడు బూజువట్టె
కావ్యగానముఁజేయు కవులన్న ప్రణమిల్లి
పొంగిపోవుట లెల్ల కుంగిపోయె
కవిగాని వానికి కానిడబ్బీ యని
ప్రతిన లెల్లను నేఁడు పాడువడియె.

కవిత యన్నను కవి యన్న గలిగె ద్వేష
మౌర! కాల మ దిట్టుల మారిపోయె
మన్ననలు లే వటంచును మానగలమె!
సహజమౌ ధార నాపగ శక్యమౌనె!

కృతి యనఁగ నేమి వస్తువో
మతిలో నెఱుఁగంగలేని మాన్యులు గల మా
క్షితిపై సత్కృతు లే గతి
పతనము గాకుండు నమ్మ పలుకుల వెలఁదీ!

అనుభవించితివి దివ్యభోగముల నెన్నొ
భూమిపాలుర అంకసీమలందు
ధరియించితివి యెన్ని తరతరంబులకైన
తరుగని కీర్తిచే మెఱయు నగలు
పైఁ గప్పితివి నీదు వాక్చమత్కృతిఁజూపి
సరసులిచ్చిన పట్టుశాల్వ లెన్నొ
యూరేగితివి బారు బూరుగా నానాఁటి
పేరైన గజపు టంబారులందు

చరిత నెఱుఁగని వారి కీసంగ తేల?
ఒక్కరిద్దఱు మముఁబోలు తిక్కగాండ్రు
వగచినను లేదు లాభ మావంతయైన
చెడిన కాలము దాపురించెనుగదమ్మ!

చాలును నాకుఁ గల్గు సిరిసంపద లింక విశేషమైన భా
గ్యాలకుఁ జేయిజాపను మహాత్తర భూరియశఃప్రభావ శో
భా లలితంబు నీ చరిత మట్టి యదృష్టపురేఖ లీ గతిన్
గ్రాలె నటంచుమాత్రము వగర్చెద నో కవితాసరస్వతీ !

కవి నని చెప్పుకొం చొక బికారివిధాన తయారుకాక శ్రీ
ధవు కృపచే జగాన నొకదారిని నుంటిని నీదు ప్రాపుచే
భవ మది యీడ్చు టన్న స్థితిపట్టదు తల్లిరో! యింక నీదు వై
భవ మది యెట్టుగ్రాలిన వివాద మిఁ కేలను జెప్పు మమ్మరో!

ఎత్తున కెత్తు పద్దెమున కింత సుమారగు పైడిముద్ద నా
కిత్తు రటంచు త్రివ్వి తల కెత్తుదు రెట్టివా మేటివైన సం
పత్తు లటంచు గాదు నను పట్టిన మేటి గ్రహమ్ము సుమ్ము నీ
పొత్తు లభించు టన్న యది పూర్వకృతంబగు పుణ్యమమ్మరో !

# ఆంధ్ర భాష

నన్నయ పెంచఁగాఁ బెరిగి
నట్టి ప్రసిద్ధపు టాంధ్రభాష పే
రెన్నికగన్న తిక్కన క
వీంద్రుఁడు మెచ్చఁగ వెల్గుభాష క్రొం
దెన్నులు గల్గి నేఁడు విను
తింగనుచున్న తెలుంగుభాషలోఁ
బన్నుఁగ "ఖండకావ్యములు"
బాడితి మేనులు పులకరింపఁగా.

# ఆ ది సు క వి

జడలున్ నారముపయిన్ జెలంగ ఋషిభూషల్ దాల్చితాటాకుపై
నిడి గంటమ్మున రచించినావుగద పేర్మిన్ రామచారిత్రమున్
గడుసౌ శోకడతోడ నాదిసుకవీ! కష్టించి నీ కీర్తిన
ల్గడలన్ బ్రాకెను నీకు వందన మిదే కైకొమ్ము విద్వన్మణీ!

రామకథన్ రచించితివి రమ్యపుభక్తిని తానుగూడ శ్రీ
రామకృతిన్ రచించె రఘురాముని భక్తుఁడు వాయుపుత్రుఁడా
స్వామియు నీదు సత్కృతికి సంతస మందెను నీదుధన్యతన్
నేమది వర్ణనల్ సలుపనేర్తును! చెప్పుము నాకుసంభవా!

పట్టుగ రామమంత్రము జపం బొనరించెడిపట్ల నీపయిన్
పుట్టలు మొల్చెగాని జపమున్ విడనాడవు పట్టువీడి నీ
దిట్టతనంబుఁ జూచి జగదీశ్వరుఁడే కరుణించె నయ్య నీ
పుట్టుక ధన్యమై వెలసె భూమిపయిన్ మఱి చెప్ప నేటికిన్.

దారులు కొట్టి పాప ధన
ధాన్యము లార్జనఁజేసి నీవు సం
సారముఁజేయు దోషి వయి
చక్కఁగ తావకపూర్వపుణ్యమై
శ్రీరఘురామ మంత్రము వి
శేషజపం బొనరించి నీ వచో
ధారల ముంచి తేల్చితివి
ధన్యుఁడవై రఘురామ సత్కథన్.

# వ్యాసముని

వ్యాసుఁ డటన్న విష్ణుఁ డని
వార్య మహామహిమాఢ్యుఁ డన్న వి
శ్వాసము లోకులందు మఱి
శక్యమె? నిన్వినుతించి చెప్ప నో
వ్యాసమునీ! పురాణములు
భారత భాగవత ప్రబంధముల్
వ్రాసిన నీకు సాటి గల
వారలు లేరు ప్రపంచమందునన్.

# కాళిదాసు

శ్రీరమణీయ కావ్యము సృజించెడిపట్టున నీదు గంటపు
స్వైరు దలంచియే మొదలుపెట్టవలెన్ గృతి లేకయున్న ని
స్సారమెగాని యట్టి కృతి సారయుతం బని పండితేంద్రులున్
గూరిమితోడ మెచ్చరిదిగో తమకీర్తియె సాక్ష్య మిందుకున్.

అబ్బురపాటు దోఁప హృదయంబున సంతస మిచ్చు నీదు మేల్
గబ్బము లెల్ల సంస్కృతపు కావ్యజగత్తున రంకె వేయుచున్
నిబ్బరమై వెలుంగునెడ నిన్నదిరించిరె యెవ్వరేని యో
యబ్బొయటంచు తాము భయమందిరి లే కుకవీంద్రబృందముల్.

సుధకును తీపివోలెఁ దమ సుందరవాక్కలిత ప్రబంధపున్
గథలకు నెక్కుడైన రుచి గల్గుటయున్ సహజంబు నీ వచో
మధురిమ నెన్నఁజాలుదురె మాదృశు లేరును మున్నుగూడ నీ
విధమున కీర్తినందిన కవీశ్వరుఁ డున్నె ? ప్రపంచ మందునన్.

దైవతభాష సంస్కృతము
దానిని గుప్పెట నుంచి నీవు స్వే
చ్ఛావిధి కావ్యముల్ భువి ప్ర
శస్తముగా రచియించి కీర్తికిన్
దావుగ నీదు జన్మ మతి
ధన్యత మున్ బొనరించి తయ్యా! నీ
భావము లెల్ల తీయనగు
పండ్లుగదా చవిఁజూచువారికిన్.

# నన్నయ

ఈవటు పద్య మల్లునతఁ డింతకుమున్ను జనింపలేద ఈ
భూవలయంబునన్ గవితపుట్టెను నీ కలమందు ముందుగా
జీవముఁ బోసి మా తెలుఁగుక్షేత్రమునందున బీజ ముంచి నీ
భావము లన్న నీర మిడి పండగఁజేసితి తెల్గుకైతలన్.

పన్నుగ నీవు హృద్యమగు పద్యము లల్లెడు తావునందు ఏ
వెన్నెలగూడి దివ్యమగు విందొనరించెనో? లేకయున్న నీ
యున్నతభావముల్ తళుకు లొత్తునె? యింకొకఁ డెవ్వఁడేని య
భ్యున్నతి నొంది నీవుబలెఁ బూజల నందిరె? రాజరాజుచే?

విపుల ప్రాభవ 'శబ్దశాసన' లసద్విఖ్యాతనామంబుతో
జపహోమాది విశేషకర్మ లవనిన్ సాగించి పూజ్యుండవై
విపరీతంబగు త్రోవఁబోక కవితన్ వెచ్చించి నల్దిక్కులన్
ఉపకారం బొనరించి తాంధ్రజను లోహోయంచు మెచ్చ న్నినున్.

# పెద్దన

పెద్దవు నీవు పూర్వకవి బృందములందున నీ కవిత్వముల్
ముద్దులు గుల్కు నాంధ్రకవిముఖ్యుల డెందములందు రాయలే
దద్దయు భక్తిచే 'గవిపితామహ' యంచు బహూకరించె నీ
యొద్దను సాఁగెనే! కుకవియుక్తులు పూర్వపుకాల మందునన్.

సారకవిత్వ సంపదల సంగతియందున మేటి వౌట నీ
పేరు ప్రసిద్ధి కెక్కెను కవీశ్వరులందు పితామహుండవై
శ్రీరమణీయ కావ్యములచే భువి రాయలఁ దన్పి గండపెం
డేరముఁ గాలఁ బూనియు గడించితి వెన్కుఁడు కీర్తిచంద్రికల్.

మనుచారిత్ర్యముఁజూడ నాంధ్రులకు బ్రహ్మనందము ల్గల్గు నీ
ఘన గంగాలహరీసమాన కవితాగర్భానఁ జెన్నొందు మా
మనముల్ మోదరసప్రవాహభరసమ్మగ్నాత్మముల్ గాఁగఁ దో
చిన పద్యమ్ములచేత నీ కవితఁ బూజింపంగఁ నూహించితిన్.

ఏ కవికావ్యంపు జోకుచే రాయలు
కీర్తి నెంచక పల్లకీని మోసె
ఏ కవికావ్య మస్తోకమాధుర్యమై
యింటింటియందు వ్యాపించియుండె
ఏ కవికావ్యంబు లోకవిఖ్యాతమై
పండిత లక్ష్యమై బఱఁగుచుండె
ఏ కవికావ్య మిం కే కావ్యములతోడఁ
బొత్తు నొందకయె సంపూజ్య మయ్యె

అట్టి కవి వైన నీ కావ్య మాంధ్రభువిని
ప్రజల కెల్లను జ్ఞానదీపంబు గాదె!
ఎట్లు నేర్చితి పాండిత్య మిట్టి దీవు
పెద్దనామాత్య! కవితకుఁ బెద్ద వీవు.

# పోతన

లేతమావుల నెక్కి చేత ముప్పొంగఁగాఁ
గూయు కోయిల గండు కూతకన్న
గోపికామణు లెల్ల గోరు కృష్ణుని
వేణు వీణారవములోని విందుకన్న
పదియారు కళల శుభ్రాంశు మోమునఁ గల్గు
బహుసుధా విభవసంపత్తికన్న
జాజిమొగ్గల దివ్యసౌరభంబుల నూని
ప్రవహించు నల గంధవహునికన్న

నెక్కుఁడౌ నీదు కవితచే నింపినట్టి
భాగవత మాంధ్రమునందునఁ బ్రబలి నీదు
సద్యశంబును వేనోళ్ళ జాటుచుండె
మఱచిపోలేము నిన్ను మా మనములందు.

ముద్దుల్ గాల్పెడు నీ మనోవనములోఁ బుష్పించె నెన్నెన్నొ మేల్
పద్దెంపుం బువుగుత్తులా పరిమ సౌభాగ్యంపు తావుల్ భువిన్
హద్దుల్ మీరి సమస్తభూవలయ మెల్లన్ బ్రాకి వ్యాపించె నీ
విద్దెల్ సేర్వ్యక భూమిలో సహజమై వెల్గొందె కవ్యగ్రణీ!

పరువును వీడి కావ్యసుతఁ బాలొనరింపను నీచవృత్తితోఁ
బరుల కటంచు మేల్ప్రతినఁ బట్టుచు తత్కవితాకుమారి నీ
శ్వరునకు ధారవోసి భవబంధముల న్విడనాడి మేటివై
మెఱసిన నీ మహాకవిత మెచ్చఁగ మా తర మౌనె సత్కవీ!

పలుమాటల్ పలుకన్ బనేమి కవితన్ బాడించి తచ్చోభలన్
దెలియం జేయఁగ త్వత్కవిత్వ మెలమిన్ దీపంబుగా నిల్చెఁ గ్రాం
దెలుగుం గైతకు దారిఁజూపినది ధాత్రిన్ నీదు ఘంటంబు మా
వలనం గాదని చేతులెత్తితిమి నిన్వర్ణింపఁగా సత్కవీ!

చుక్కలలోనఁ చందురుని చూడ్కిని నాంధ్రపుకావ్యలోకమం
దెక్కుడు గౌరవంబు వహియించిన భాగవతంపు పద్దెముల్
దిక్కుల నిండి మా తెలుఁగుదేశ కవీశ్వరు లొక్క రొక్కరే
మక్కువమీర నీ మధురమంజుల శైలినిఁ బ్రస్తుతించెడిన్.

పావను లైన గాని భగ
వంతునిఁ గన్నులఁ జూడలేరు నీ
వే విధిఁ బూజసేయ రఘు
వీరుఁడు దర్శన మిచ్చి దివ్యమా
ధావసమృద్ధమై వెలయు
భాగవతంబున నోడువిల్చె; నీ
సేవకు నాంధ్రలోకము వి
శేషఋణంపడె నయ్య సత్కవీ!

స్వచ్ఛమై పాఱు గంగా స్రవంతివోలెఁ
జాలువారెను నీ కైతజాలు భువిని
మధురమంజుల పదముల మాల లెల్ల
నిండె నీ కైతలోపలఁ బండువగుచు

భారతీదేవి నీ చేరువ నుంట మేల్
రంగగు భావముల్ పొంగె నేమొ!
రఘురామమూర్తి దర్శన మిచ్చుట న్జేసి
దివ్యమా శైలి వర్ధిల్లె నేమొ!

సహజపాండితి నీకు సంభవ మౌటచే
ధారాళ పదశుద్ధి తనరె నేమొ!
నరులకుఁ గృతినీయ ననెడి మేల్ప్రతినచే
జగమున నీ కీర్తి నెగడె నేమొ?

పద్దెమును వ్రాయు గంటము పట్టునపుడు
సురలు కుసుమంపు వృష్టి నీ శిరమునందు
గురియఁజేయుచు నుత్సాహకరములైన
ముద్దుపలుకుల దోహద మొసఁగి రేమొ!

# కాసుల పురుషోత్తమ కవి

వాక్కులు తేనెలై మధురవాహినిగాఁ బ్రవహించెనయ్య మా
చక్కని తెల్గునేల కవిచంద్రమ! తత్కవితాస్రవంతిలోఁ
జొక్కి ప్రగాఢనిర్మల సుషుప్తినిఁ దేలనివారు లేరు కై
పెక్కువటుల్ బొనర్పు సుకవిత్వము నీకు లభించె సత్కవీ!

వీనుల విందుఁజేయు సుకవిత్వము సృష్టి యొనర్చుపట్ల నీ
స్థానము గొప్పగాఁబఱఁగె; తావక దివ్యకవిత్వవాగ్ఝరుల్
పూనికతోడ మా తెలుఁగు భూములలోఁ బ్రవహించి తెల్గుమా
గాణము శ్రేష్ఠమై బఱగెఁగా! కవితా వనితా మనోహరా!

# యోగక్షేమాలు

భగవద్భక్తుఁ డొకండు నిత్యమును సద్భావంబుతో 'గీతల్'
దగఁ బారాయణఁజేయుచు న్మిగుల శ్రద్ధాభక్తులుం గల్గి యొ
ప్పుగ నా దేవుఁ భజించుచు న్దగిన తృప్తుం డౌచు నీ రీతిగా
సుగుణుల్ మెచ్చఁడిఫక్కి నుండె విలస చ్ఛుద్ధాంతరంగుండునై.

తల్లిదండ్రులు లేర! యాతనికిఁ జూడ
జీవనముఁజేయు యత్నమే చేయఁ డతఁడు
భారమంతయు దేవునిపైన నుంచి
యీశ్వరధ్యాన మొనరించు నెల్లవేళ.

పౌరోహిత్యముఁజేయుచున్ గృహముసంబాళించు సోదర్యులున్
ధీరోదాత్తుడునైన యాతని విధిన్ ద్వేషించి యీరీతిగా
భారంబున్ బరమాత్మునందు నిడి నిర్వ్యాపారివై యున్న సం
సారంబున్ సరిదిద్ది భోజనము దా సాధించి యీ కిచ్చునే!

సోమరితనమున నీ విటు
లేమరి కర్తవ్య విధము లెంచక యున్నన్
భామలు సైతము నగరే!
భూమిని నిన్నుఁ బోలునట్టి పురుషుఁడు గలఁడే!

కుడువఁ గూడును ధరియింప గుడ్డ మిగుల
గలుగు సాములకే గాని కావు మనకు
నేల వేదాంతములు నీకుఁ జాలు చాలు
తనకు మాలిన ధర్మముల్ ధరణి గలవె?

కలసి మెలసియు మాతోడ మెలఁగ దేని
యిట్టులే యింక కొన్ని నాళ్లీడ్వఁగలము
వ్యర్థముగఁ గూరుచుండిన వారి కెవ్వ
రేని గొని తెచ్చి మిగుల పోషింపఁ గలరె!

అనుచు నిష్కర్షగాఁ బల్కునట్టివారి
పలుకు లాలించి యిట్లని పలికె నతఁడు
సకలజీవులఁ బోషింప నొకఁడు గలఁడు
గోడు గుడువంగవలదు నాకొఱకు మీరు.

ఇంతటినుండి మీరలు సుఖింపుడు నన్విడనాడి నే రమా
కాంతునిసేవలో మునిఁగి కాలము నిట్టులెఁ బుచ్చుచుందు మీ
స్వాంతములందుఁ దోఁచినటు పంచుడ పత్ర్యణమేదిగాని నా
వంతున కున్న నద్దిగొని వర్తిలు చుండెదఁ దోఁచినట్లుగన్.

తిథులు సరిచూచి మఱుసటి దినమునందె
తమకుఁగల యట్టి యాస్తిమొత్తమును వారు
చీలఁదీసిరి మూఁడు భాగాలుగాను
వేయివర్షంబులకు నైన వేఱుగాదె!

కొన్ని సామానులును మఱికొన్ని నగలు
కొన్నిపాత్రలు మఱియునుఁ గొంతసొమ్ము
చేరి వసియింప నొక చిన్నపూరిపాక
వచ్చె మనభక్తునకుఁ దనవంతుగాఁగ,

భార మొల్లక యదె మహామేరు వనుచుఁ
దృప్తిచే మానఁబోడు దాతృత్వవిధిని
పోల్చిచూచిన రెండవబుద్ధుఁ డనఁగ
వెలయు సుగుణాల ప్రోవుగా వెలసినట్లు.

ఒక్కనాఁ డాతఁ డేదియో యూహఁజేసి
భార్యతోడుత నిట్లని పలికె "మనకు
నేది లోటైనగాని నీ వితరు లిండ్ల
కేగవల దేదినైన యాచింపవలదు.

మెచ్చి యెవరేని దానము లిచ్చుగాక
యెట్టి సమయములందునయేని నీవు
తీసికొనరాదు, మన కని దేవు డిచ్చు
దానికే తృప్తిగని యుండఁదగును గాని".

అనుచుం జెప్పిన భర్తృవాక్యముల నయ్యబ్జాక్షి లో నెంచి యా
తని చిత్తానుగతంబుగా వినయమా దారిన్ బ్రవర్తించుచున్
అనువౌనట్టి పదార్థముల్ మిగుల రుచ్యంబౌనటుల్ వండి పె
ట్టును సద్వర్తనమే ప్రధానముగ నుండున్ భర్తృసేవా రతిన్.

ఆస్తికుండును ధర్మ మార్గానుగతుఁడు
నైన యా విప్రవరుఁడు తా ననుదినంబు
డాపునందున్న యొక్క తటాకమునకు
నరిగి 'యఘమర్షణస్నాన' మాచరించి.

శుచియై యాతఁడు గీతలన్ దెరచి తచ్ఛ్లోకాల పారాయణన్
బచరించున్ దన కెల్ల యర్థము మనోభావంబునం దుండఁగా
శుచియై గేహమునందు భార్య పరమేశున్ గొల్చుచున్ జేయు మేల్
పచనంబున్ భుజియించి నిశ్చలుఁడునై ప్రార్థించు నా దేవునిన్

అర్జనము లేని ఖర్చున కాఁగఁ గలవె?
గనులుఁగా వెటువంటి బొక్కసము లైన
దినము లేగినకొలఁది యాతని ధనంబు
సన్నగిలి నంత నతనితో సతియుఁ బలికె.

'దయఁ గలిగి వారు పంచిన ధనమువలన
నెట్టులోఁ గాల మిదివఱ కేఁగె నేఁడు
కొక్కము సమాప్తమయ్యె నెఱుంగ నైతి
నీశ్వరుం డేది దారిఁజూపించు నొక్కొ' ?

అంతట నాత డిట్టు లనె 'యంబుజనాభునిపాదము ల్వినా
చింతనఁ జేయునట్టి దొక చిన్నము లేదిల నాకు భక్తులం
దెంతొ యపేక్ష యున్న పరమేశ్వరుఁ డేల యుపేక్ష జేయు నీ
చింతలవల్ల కార్యములు సిద్ధములౌనె! తలంచి చూచినన్.

సంశయ మ దేల కొన్నిభూషణము లుండె
పాత్రి లుండెనుగా వీనివలనఁ గొంత
కాల మేఁగినతరువాత గతిని జూచు
కొనఁగవచ్చును ముందుయోచన లవేల'?

పరమపతివ్రత యగు నా
తరుణీమణి విభునిపలుకు తత్త్వముఁ గని యా
తెఱఁగున నగలను మార్చియు
జరిపెను మఱికొన్నినాళ్లు సంసారంబున్.

అవియుఁ గొన్నినాళ్ళ కంత ముగుసె కాక
గృహములోని పాత్ర లెల్లఁగూడ
పరిసమాప్త మగుట భామామణియు నాత్మ
విభునిఁ గనుచుఁ బలికె వినయ మొప్ప.

"నాథ! మనము కట్టినట్టి వస్త్రంబులె
కాని యింటఁ జిల్లిగవ్వ లేదు;
భోజనంబు నిన్న భుక్తమయ్యెను
నింక స్వామివారి యాజ్ఞ లేమి యానొ?"

అని యిట్లు వలుకు దన సతిఁ
గనుఁగొని సర్వేశు మహిమఁ గనుగొన నగునే
యని పలికి గీతలంగొని
వని కేఁగె నతండు భక్తిపరవశుఁ డగుచున్.

పోయి యచ్చట నొక తరుచ్ఛాయ విశ్ర
మించి గీతలఁ దెఱచి పఠించుచుండఁ
గ్రీడితోఁ జెప్పినట్టి శ్రీకృష్ణు వచన
మైన యొక శ్లోక మతనికిఁ గానఁబడియె.

శ్లో. అనన్యా శ్చింత యంతో మాం
యో జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం
యోగక్షేమం వహా మ్యహమ్.

(గీతా 9-22)

అనునట్టి శ్లోక మాతఁడు
గనుఁగొని విస్మితుఁడు నగుచు గంటను చేతం
గొని దాని చుట్టు నొక గీ
తనుఁజుట్టి యతండు మదిని తలఁపోసె వెసన్.

'భగవద్గీతల' నెప్డు నిశ్చలతతోఁ బారాయణ న్జేయుచున్
మిగుల న్దాము ప్రశంసనీయగుణులై మేకొందురో యట్టివార్
జగతి న్గల్గిన గాతునం చభయహస్తం బిచ్చియున్నట్టి యా
భగవద్వాక్యము లిష్టమైన నను సంబాళింపఁజే పేర్మితో.

భార మంతయు వానిపైన నుంచితిగదా
యెవ్వాఁడు మునుల కతీతుఁ డొక్కొ
చేరి యెప్పుడు వాని సేవఁజేయుదుగదా
యెవ్వాఁడు దీనుల నేలు నొక్కొ
యితరేచ్ఛ వీడి నమ్మితిగదా వానిని
యెవఁడు దాసుల వెంటఁ దవ్రుంబు నొక్కొ
నా యాత్మలో వాని నామ మెంచితిగదా
'తారకనామ' మే ధవుని దొక్కొ..

తలఁప నెవ్వఁడు సృష్టి కాధారుఁ డొక్కొ
అట్టి పరమేశ్వరుని వాక్కులైనయెడల
పాటి తప్పెన యని పరిపరివిధాల
నతఁడు యోచించుచుండె తదాత్మయందు.

గజరాజు గాచి మాన్పిన
త్రిజగన్మోహనుఁ డెఱింగి దీనుని చరితన్
నిజభక్త పోషణార్థము
స్వజనములో నుండి కదలి చయ్యన సాఁగెన్.

కదలియు వేగమె భక్తుని
సదనమ్మున కరిగి యొక్క ఛాత్రునికిరియ స
మ్మదమున యాతని భార్యా
వదనముఁ గని యామెతోడఁ భాషించె నిటుల్.

'అమ్మ! యింటిలోన నయ్యవారలు లేరె!
ఎచటి కేఁగినారొ యెఱుగఁ బల్కు
మా!' యన వెరవోయి 'మా వార లెప్పుడు
శిష్యు లున్నయట్లు చెప్పలేదె.

వింతగా నున్నయది నీదువిధ' మటన్న
యామెతోడుత నాతఁ డిట్లనియె నపుడు
వింతలే దమ్మ నేతప్ప విశ్వమందు
లేరు శిష్యులు వారి కిం కేరుగూడ.

వారియందున నాకెంతొ భక్తి గలదు
వత్సలతఁగల్గు నాపయి వారి కెంతొ
వారికిని నాకుఁ జూడఁగ వసుధయందు
వర్తిలును గాఢమైన సంబంధ మెంతొ.

స్వామియును మీరలును నింట లేమివలన
పస్తుగా నున్నయట్టి యువ్వార్త వినియు
మీకునై పుచ్చుకొని స్వయంపాక మిపుడు
పరుగు పరుగున నిటకు నే వచ్చినాడ.'

అని యిటు వల్కి యాతఁడు రయంబున వెంబడినున్న యొక్క సం
చిని యట దింపి 'దీనిఁగొని చేయుడు వంట' యటన్న చిన్నమున్
గొనుటకు వీలు లే దనుచు నొక్కి వచించిరి గాన వారు వ
చ్చినతరువాత వారలకుఁ జెప్పి యొసంగు మటన్న యాతఁడున్.

"మఱల వచ్చెద వా రింటి కరుగుదెంచి
నపు" డనుచు సంచి యట దింపి యరుగుచుండఁ
బలికె నా సాధ్వి 'వారలు వచ్చి సంచి
నింట నుంచిన దెవ రన నేమి వారి
కెరుగఁజేయుదు' నన నాతఁ డిట్టు లనియె.

'ప్రాతఃకాలమునందు మీ రెవనిపై ఊరాపునన్ ఘంటపున్
గీతన్ జుట్టితిరో యతండె మనదా గేహంబునం దుంచె నీ
గోతంబం చన నాతఁ డెల్లయు నెఱుంగు న్వేఱు మాటేం?' యం
చాతండేగ నటో యదృశ్యుఁడు 'వింతౌ గాదె యీదృశ్యముల్.

వచ్చెను సందె జామునకు భర్తృఁడు' గేహమునందు నున్న యా
వెచ్చము లున్న సంచిగని విస్మితుఁడై తనభార్యతో ననెన్
'నచ్చవె? నాదు పల్కులవి నాకె యొసంగితి వేల? వెచ్చముల్
బుచ్చుకొనంగ నేల నిదిపోలునె? ఎట్టి పతివ్రతాళికిన్.

మెచ్చి యొక రేది యిచ్చినఁ బుచ్చుకొనఁగ
వలదు వల దంటిగాదె? పూర్వమున నే' న
టంచు పతిపల్కు వాక్కుల నాలకించి
పలికె ననుకూలసతి నమ్రవచనరచన.

"లేదు దోసము నాయందు లేశమేని
యాలకింపుఁడు నేఁటి వృత్తాంతమెల్ల
తమకు శిష్యుఁడ ననుచు విద్యార్థి యొకఁడు
వాకిటను వచ్చి నిలఁబడి పలికె నిట్లు.

'ఎఱిగితి మీరు మా గురువు లీ దినమందు భుజింపలే దంటం
చెఱిగితి గేహమందు తృణమేనియు లేదని నే నెఱింగి యే
పరుగున వచ్చినాడ నిదె పాకపు వస్తువు లున్న సంచితో
గర మనురక్తి దీని గొనఁగాఁదగు' నన్న నిటుల్ వచించితిన్.

'వింతగాఁ దోఁచు నీదు వృత్తాంతమెల్ల
శిష్యు లున్నట్టు మా వారు చెప్పలేదు
వలదు వల' దన్న నాతఁడు బలిమితోడ
సంచి నిటనుంచి బోవఁగా సాఁగె నపుడు.

వెడలు సమయాన నే వానిఁబిలచి
యయ్యవారితో నేమి చెప్పఁగా వలయునన్న
వేయిమాట లికేటి కీ విధముగాఁగఁ
దెలుపవలెనంచు గట్టిగాఁ బలికె నతఁడు.

'ప్రాతఃకాలమునందు మీ రెవనిపై ఱారాపున స్గంటపున్
గీతంజుట్టితిరో యతండె మనదా గేహంబునందుంచె నీ
గోతంబంచన నాత డెల్లయు నెఱుంగున్ వేఱుమాటేల యం
చాతండేగె నటో యదృశ్యుడయి వింతై తోఁచె నా కప్పుడున్.

అని యిటు పల్కినంతటనె హర్షపయోధి మునింగి యాత్రేఁడున్
మనమున నూహజేసి వినుమా! కడు ధన్యవు నీ పురాకృతం
బనుపమ పుణ్యగర్భిత మయారె! జగంబులకాది దేవుఁడై
తనరెడు వేల్పు వాకిటను దర్శన మిచ్చె నిఁకేమి కావలెన్?

పాతకుఁడన్ నరాధముఁడ బావనమై విలసిల్లునట్టి యా
గీతను నమ్మఁజాలని నికృష్టుఁడ నా పరమేశ్వరుండు నా
చేతకు నెంతగా విసువుజెందెనో? ఎట్టి పరీక్ష సల్పితిన్
ఘాతుకమైన యిట్టి ఘటనన్ దన మానస మెంతకుందెనో?

పాతకులైనవారలను బావనులన్ బొనరింప నెంచియే
గీతల బోధసేసెగద క్రీడికి నా మధుసూదనుండె యా
నీతులె యౌను గీతలన నేనొక స్వార్థపరాయణుండనై
గీతల భావ మెంచకయె గీచితి గీ టెటువంటి మూర్ఖుఁడన్.

వ్యర్థుఁడను దుష్టుఁడను జగద్వంచకుఁడను
కనుకనే సామి నాకు దర్శనము నిడ డ
టంచు దాపున గలయట్టి సంచిఁ జేత
బట్టుకొని క్రుమ్మరించె నా పట్టునందు.

ఒక ద్వారమునుండి జారెను మహోజ్జ్వలరత్నము లెన్నో యింక వే
ఱొక ద్వారమునుండిజారెను మెఱుంగులుజిమ్మెడి వజ్రములో యొకా
నొక ద్వారమునుండి వెచ్చము లనూనముగా గృహమందుఁ జారఁగా
దికమిక గల్గె వారలకు దేవునిచర్యలు వింత లౌటచేన్.

పరగ నాతఁడు గద్గదస్వరముతోడ
బాడఁగా సాఁగె సంతటఁ బరమపురుషుఁ
డైన హరిఁగూర్చి యీ రీతి నధికభక్తి
తోడ మే నది ముదమునఁ దూఁగులాడ!

నీతిఁ దొఱంగి మాయలను నేర్చిన ఘాతుకురాలు పాపి యా
పూతన చంపఁగాఁ దలఁచి పూర్ణ విషస్తన మిచ్చినన్ మహా
పూతుఁ డతండు నామెకును పుణ్యులు నోమెడి త్రోవఁ జూపె నే
నాతని వేడెదన్ శరణ మంచని చేతులు మోడ్చి భక్తితో.

అని ప్రార్థించి
'భగవద్గీతల' నెప్డు నిశ్చలతతోఁ బారాయణన్ జేయుచున్
మిగుల న్దాను ప్రశంసనీయగుణుఁడై మేకొంచు నీరీతిగా
నిగమాతీతుని వేదవేద్యు గరుణాస్వాంతాత్ము దీనావనున్
భగవంతున్ మది నమ్మి యాతఁడటు లేవర్తించుచుండెన్ భువిన్

శ్రీహరి శాస్త్రి భక్తకవి
శేఖరు డందు రటంచు గాదు నే
మోహమువీర నీ కథను
ముద్దులు గుల్కెడునట్లు పద్యసం
దోహముఁ జేసినాడ; కృప
తో రఘురాముఁడు ప్రక్కనిల్వఁగా
స్నేహమునూని యాదరముఁ
జేతురు సర్వజనుల్ సుధీధనుల్.

# నక్షత్రమాల

కవి నౌదు న్గనసేను నీవు కవితాకౌశల్యమున్ మెచ్చవా
డవుగాఁ బెక్కుపురాణముల్ మిగులజాటన్ విందు నేనట్టిచో
నవినాభావపు స్నేహబంధ మది లేదా? యుర్వారందున్ ప్రభూ
కవులందున్ గల గౌరవంబు గలిలోఁ గాపాడు రామప్రభూ!

ఆధివ్యాధులు లేని జీవితమునే యర్పించివా వీవు; యే
బాధల్ గూడను లేవు కాని మదిలో బాధించు నొండాశ నా
గాధల్ నీ కెటు లక్ష్మ మౌన? యగుచోఁ గాపాడ కి ట్లేమనో
బాధల్ గూర్చదవే? ప్రపంచమున దేవా! నీవు రామప్రభూ!

ఉన్నా వందురు లే రటందు రిలలో నున్నావొ! లేవో యటే
యున్నా వీ వను మాటయే నిజమటం చూహించుచో భక్తులన్
విన్నాణంబుగఁ గాచు టేది మది లే వీ వందుమా! చెప్పు మో
యన్నా! నీ యుని కెన్న నేర్తు మెటు దేవా! నేను రామప్రభూ!

సతిమున్ దిక్కగువాడ వీవని మదిన్ సంభావనన్ సల్పు నా
గతి నీలాగునఁ జేసి మూఢప్రభులలోఁ గష్టంబులే గూర్చి యీ
గతి వేధించుచు హీనజీవితునిగాఁ గల్పింప నీ కున్న యా
పతితానీకముఁ గాచు మేల్ బిరుదముల్ పాడౌను రామప్రభూ!

ప్రారబ్ధం బని యందువా? యదియు నిన్ బద్యాలచే వేడుచో
దారిన్ బట్టదె? యట్టిచో నిఁక ననున్ ధన్యాత్ముని న్జేయఁగా
నేరం బౌనె? దయారసాబ్ధివిగదా! నీ విట్టి నా స్వల్పమౌ
నేరంబుల్ గణియించు టెల్లను గడున్ నీచంబు రామప్రభూ!

అయ్యో! అన్నను జాలిగల్గ దేటు లయ్యా నిన్ను ప్రార్థించుటల్!
దయ్యాలైనను నా మొరల్ వినిన డెందంబందు చింతించు నే
మయ్యా! నీ కిటువంటి నిర్దయత న్యాయ్యం బౌనె? యోజింపు మ
య్యయ్యో రాజకులావతంసుఁడవు గావా! నీవు రామప్రభూ!

రాజున్ రెడ్డినిఁ జేయు రెడ్డిని మహారాజున్ వెసన్ జేయు నీ
తేజం బంచు భవత్కృపారసము నెంతే గోరి వేడంగ న
వ్యాజంబౌ కృపఁ జూపి భక్తుల మొరల్ పాలింపకున్నట్టి నీ
తేజం బేలను? లాభ మున్నె నినుఁ బ్రార్థింపంగ రామప్రభూ!

కవులై భోజునిబోలు రాజులపయిన్ గబ్బంబుల న్జెప్ప న
క్కవిచంద్రుల్ ముదమంది పొంగునటు గాన్కల్ గూర్చి పోషింపరే
కవినై తావక దివ్యపద్యకలిత గ్రంథంబుల న్జేయు ని
క్కవి కే కాన్కలు గూర్పవైతి విది యుక్తంబౌనె! రామప్రభూ!

కవినై హృద్యము లైన పద్యములచేఁ గాపాడవే యంచు నీ
చెవిలో గేహముగట్టి పోరినను గాసిన్ మాన్పలేనట్టి నీ
వు వివేకాత్ముఁడ వెంచుఁ జాలెడి కథవ్యూహంబు నేవారలో!
యవివేకుల్ రచియించినట్టి వని యూహల్ దోఁచు రామప్రభూ!

సిరికిన్ జెప్పకయే మహోత్సుకతచే శీఘ్రంబుగా భక్త సం
స్మరణన్ విన్న మఱుక్షణంబె పయనంబై వచ్చి యవ్వారికిన్
గర మానందముఁ గూర్చువాఁడ వని వక్కాణించె పోతన్న దే
వర కారుణ్యవిశేషముల్ పొగడ నా వల్లౌనె! రామప్రభూ!

వల దన్నన్ విడఁబోనుఁ బద్దెములచేఁ బ్రార్థింతు నా జిహ్వ కీ
పలుకుల్ పల్కుట నైజమైన యొకయేర్పాటుచే రెండువం
దలకున్ లోపకు పద్యపుష్పముల చేతఃప్రీతియౌ ముద్దుప
ల్కులతో నీపయి జెప్పినాఁడ నవనిన్ లోకేశ రామప్రభూ!

ఒక వాంఛ న్మదిఁ బూని నీపయిని నెన్నో పద్యముల్ చెప్పి కో
రిక సాఫల్యముగాఁగ మోదమున నార్తిన్ వ్రాసి నే నున్నచో
నిఁక నా పద్దెము లెల్ల నర్థుల మనోభీష్టార్థసిద్ధంబు లౌ
నకలంకం బగునట్టి నీ కృపను సాక్ష్యం బౌచు రామప్రభూ!

చిరకాలంబును నిన్నుఁగొల్చి యపుడో సేవింప నిం కొక్క దే
వరపాదంబుల వేడఁబోయినను గావన్ నేర్చునే యాతఁ డీ
ధరణిన్ గల్గిన యిట్టిధర్మములు మోదం బయ్యె నీ ప్రజ్ఞ నీ
బిరుదుల్ నీప్రభ లక్కజంబుగొలుపున్ బేర్కొన్న రామప్రభూ!

తప్పో! యొప్పో యెఱుంగఁజాల నది యే తప్పైన గానిమ్మ నే
జెప్ప న్నేర్తును ధారగాఁ గవిత నీ చిత్తానకు న్మెప్పుఁగా
నొప్పై దోఁచునొ లేక తప్పగునొ? నే నూహింపఁగా నేర నా
ముప్పాల్ బాపుము గొప్పఁగా భువి నినున్ బూజింతు రామప్రభూ!

దూరాలోచన లేనివాఁడ నను నేదో భక్తుగా నెంచి నా
ప్రారబ్ధం బెడఁబాపుమయ్య కవినై ప్రార్థించుచున్నాఁడ నీ
కారుణ్యమ్మె శుభమ్మె యన్నిటికిఁ దా గాణాచియై న్నాటలే
దా రాజిల్లును లోకమందు నిది క్రొత్తా! తండ్రి రామప్రభూ!

ఏ కార్యం బది చేయఁబూనిన నెంతే నన్ను నీ సత్కృపా
నీకప్రాభవ మిచ్చి ప్రోచెదవు నీ నేర్పెల్లఁ జూపించి; నీ
వాకారాదులు లేని యీశుఁడవు ని న్నర్చించి మౌనీంద్రు ల
ప్రాకంబైన శుభంబులంది రనుటే చోద్యంబు రామప్రభూ!

తఱచు న్నెప్పుడు వింటి దీనులై నినున్ ధ్యానింతుర న్మాట నీ
స్మరణన్ సల్పరు దివ్యభోగయుతులై సంపన్ను లెవ్వేళ నే
నరయన్ దీనుఁడ నౌటయే మెఱుఁగటం చాశింతు లేకున్న నీ
కరుణన్ బొందుట శక్య మౌనె! భువిలోఁ గారుణ్య రామప్రభూ!

భక్తుల్ ప్రార్థనఁజేసి తాము మిగులన్ బ్రాల్మాలి ని న్దూఱుచో
యుక్తాయుక్త విచారశూన్యు లనుచు న్వోచించి యవ్వారిపై
రక్తిన్ జూపుట మానఁజోకుము కృపన్ రక్షించుటే పాడి యా
వ్యక్తుల్ మానవు లన్న సామెత మదిన్ బాటించి రామప్రభూ!

నను రక్షించుట చేతగాని పనియో నా కేమి రక్షింపఁగాఁ
బనియం చూరక యుంటివో మిగుల న న్బాధించి యేడ్పించుటే
ఘనమా సంగతిగాఁ దలంచితివొ! న న్గాపాడ శంకించి యి
ట్లనుమానించెద వేల! వేగమె ననున్ లాలింపు రామప్రభూ!

నీవు న్మెచ్చిన మెచ్చుకున్న సరియే నేఁ జెప్పుదున్ పద్యముల్
భావం బందున మెచ్చ వీ వనుచు నే బద్యంబుల జ్జెప్పఁగా
దేవా మానను నా స్వభావ మిది యిట్లే పద్యము జ్జెప్పటల్
గావం బూనుము యిప్పుడైన భువిలోఁ గారుణ్య రామప్రభూ!

కర్ణానందము నీ చరిత్రము వినంగా భక్తసంఘానికిన్
బూర్ణారోగ్యము గల్గు దీనులు నిను న్బూజింప నీ వీ జగ
న్నిర్ణేతాధ్యుడ వౌదు నీ కృపము లేనే లేదు విశ్వంబునన్
బర్ణాదుల్ దిని గొల్చు సన్మనుల తాపం బార్పు రామప్రభూ!

గురువుండవ్వాలె సర్వవిద్యలకు నాకో నీ పదధ్యానమే
గురువై యెప్పుడి నంతమాత్రమున నే గూర్చుండి పద్యంబుల
న్విరచింప న్గలశక్తిగల్గె నిది నీ విఖ్యాతికిన్ సాక్ష్యమా
తరు గే మున్నది నిన్ను గొల్చునెడ మోదం బబ్బు రామప్రభూ!

గోరంతైన భవత్కృపారసము భక్తుం డంచు నా కిచ్చుచోఁ
జేర న్నేరవు ఆపదల్ భువిపయిన్ సేమంబె వర్ధిల్లు న
న్నీ రీతిన్ గరుణింపవే యనుచు ము న్నే వేడితిన్ గాదె గం
భీరస్వాంత! మహానుభావ! యిదియే విజ్ఞప్తి రామప్రభూ!

భగవద్ధ్యానముఁ జేసి ముక్తిగనుటే భాగ్యంబు వేదాంతపు
స్నిగమాదుల్ వచియించు సూత్ర మిదియే నిక్కంబు యోగీశులే
దగుసామర్థ్యులు మంత్ర తంత్రముల నిన్ ధ్యానింప నాబోటికిన్
సుగమంబా నది శుద్ధభక్తి యిది నే సూచింతు రామప్రభూ!

బాధల్ పెట్టియు భక్తుఁ బ్రోచెదవు నీ భావం బదేమో సుమా
గాధల్ చాటుట లేదె గోపన! నను న్గాపాడు మో రామ నే
బాధింన న్బడుచుంటి నంచుఁ బిలువన్ బాధింపఁగాఁ జేసి యా
బాధల్ బాపవె! వాని కంతమున దేవా! నీవు రామప్రభూ!!

ఏవో పిచ్చిగ నల్లు పద్యములకే యెంతో ముదంబొప్పఁగా
భావంబందున మెచ్చి భక్తుఁడని సంభావించి న న్గావు మో
దేవా! బాలుఁడు బల్కు తొక్కునుడు లెంతే ప్రీతితో దండ్రి దా
భావంబందున మెచ్చి సంతసిలఁడే బాగొప్ప రామప్రభూ!

భారద్వాజ పవిత్ర గోత్రజుఁడు శ్రీ బాచ్‌మ చి వంశ్యుండు ని
ర్వైరప్రాభవ సత్కవీశ్వరుడు పిళ్ళారయ్యనామాఢ్యుడున్
పేరుంజెందిన కీర్తిశాలి మిగులన్ విఖ్యాతుఁ డవ్వానికిన్
గారాబంబగు పౌత్రుడన్ దయను న న్గాపాడు రామప్రభూ!

# ఆస్థానకవి

పూని వధానముల్ పలికి పూజలనందిన మా వధాని పం
చాననమున్ ప్రసిద్ధ కవిచంద్రుని నిర్మల కీర్తిశాలి నా
స్థాన కవీశ్వరున్ దొలి ప్రజాకవినిన్ దనుపంగఁ జేయు స
న్మానపు టుత్సవంబు లవి మా కొనఁగూర్చె నతిప్రమోదముల్.

కవిలోకంబునకున్ మహాగురువులై కావ్యామృతం బెల్లెడన్
జవిఁజూపించి రసజ్ఞులౌ కవులు మెచ్చఁగ గీర్తిగన్నట్టి మా
కవిసింహం బిపు డీ సభాంతరమునన్ గాంభీర్య ధుర్యస్ఫురత్
స్తవనీయంబగు రూపుతోఁ బ్రజల కుత్సాహంబు గాఁ జేసెడిన్.

రాజుల కొల్వుకూటముల రాజిలు నిట్టివి యుత్సవంబులం
చే జనులో వచించు టది యెప్పుడు విందుము గాని పూజ్యుడై
రాజిలు వేంకటేశ కవిరాజును నేఁడు ప్రజా ప్రభుత్వ మీ
మోజున సత్కరించి పరిపూర్ణ ముదంబునఁ దేల్చె రందఱిన్.

కవులెల్లన్ భవదీయ కావ్యరచనా కౌశల్యముం గాంచి మీ
కవినాభావపు టాస్ఫూర్తిఁ జెలఁగి రయ్యా తెల్గువారెల్ల మీ
'శ్రవణానంద'సుపద్యముల్ మిగులను త్సాహంబుతోఁ బాడుచున్
గవితాసుందరి ప్రాపు గంటరే! కవీ! కళ్యాణముల్ పొందుచున్.

తిరుపతి శాస్త్రి నా బఱఁగు ధీయుఁడు సత్కవి నీకుఁ దోఁడుగా
వరలగ దేశమందు గల పార్థివ చంద్రులఁ గాంచి మేటివై
బిరుదుల నంది తత్సభల బెంపు వహించిన నీ కుపాయనం
బరయఁగ నా కవిత్వ మది యర్పణఁ జేయఁగఁజాలనే కవీ!

కుకవుల్ మీ దరిఁజేరలే రనుటకు న్గుంటూరు సాక్ష్యంబు ఈ
కకుబంతంబుల నిండె 'గీరత'ప్రభల్ కవ్యగ్రణీ! మేలుగా
సకలాంధ్ర ప్రజ డెందమందు తమ భాషా సేవకు న్మెచ్చ దే
సుకవీ! నీకు ఘటింతు నే శతనమస్సుల్ ప్రేమఁ గైకోగదే.

ప్రౌఢులు పుచ్చఁగా రచనముల్ బొనరించిన కైతగాదు తా
మద్దిర యంచు నాంధ్ర కవులందఱు మెచ్చులు చూపునట్లుగా
నొద్దికతోడ నొప్పు మహిమాజ్వలమై విలసిల్లు నట్టివే
ముద్దులు కారు మీ కయిత ముచ్చట లీ భువిలోన సత్కవీ!

మీసము లేల మీ కనుచు మిణ్కొడివాండ్రకు బుద్ధి చెప్పఁగా
రోసముఁజెంది తద్విధ మెఱుంగుడు సంస్కృతమాంధ్ర మన్న మే
ల్బాసల కిర్వి నిక్కమగు పట్టుడుకొమ్మ లటంచుఁ జెప్ప మీ
మీసల పద్దెముల్ దెలుప మేనులు పొంగవె ! వేంకటేశ్వరా !

బందరు పౌరులెల్ల మిము బ్రహ్మరథంబును బట్టి కొల్వ మ
ధ్యందినభానుఁ బోలిన ప్రతాపముతో విలసిల్లు నట్టి మీ
కుం దగురీతి గౌరవముఁ గూర్పఁగ నెంచియుఁ బెద్ద లెందఱో
పొందుగ షష్టిపూర్తి మహముల్ బొనరించిరిగాదె సత్కవీ.

లేరుగదయ్య నీ కవన లీలలఁ దేలనివారు లేరుగా
ధీరుఁడవైన నీకును విధేయులు కానటువంటివారు నీ
సారతర ప్రబంధ పదజాలముఁ మెచ్చనివార లెచ్చటన్
లేరు గదయ్య నీ ప్రతిభ లెల్ల జగద్విదితంబులౌ కవీ !

మిణుగురు పుర్వు నౌదు కవిమిత్రుల ముందర అట్టిచో భవ
ద్వినుతికిఁ జాలినట్టి సుకవిత్వము సృష్టి యొనర్ప నేర్తు నే
పనిగొని వ్రాసినాడ తమ ప్రాభవ మెన్ను కుతూహలమ్మునై
గాను మివి ప్రేమతోడ ననుకూలముగా సుకవీశ్వరోత్తమా.

పాయని ప్రీతితోడ మదు
పాశ్యుఁడు శ్రీ రఘురామమూర్తి దీ
ర్ఘాయు నొసంగి తాను చిర
కాలము మిమ్ముల మాకు నండఁగాఁ
జేయుత! చెళ్ళపిళ్ళకవి
సింహామ! మీ పయి నింతకన్న నే
వ్రాయఁగ దగ్గ వేమి కల
వయ్యా కవీశ్వర! చెప్పుమా కృపన్.

# కవిస్మృతి

పలుకు వెలంది మేల్పసిడి పల్లవ బాహులమధ్య గల్గు నా
చెలువగు వీణెయందు ధ్వనిఁజేసెడి తీఁగెలనుండి మేలుగాఁ
బలికెడు నొక్కతీఁగె తెగి పాడయినట్టుల ఆంధ్రదేశమో
లలితకవీ! నినున్ విడచి రాణఁదొరంగె నదృష్టహీనయై.

తెలుఁగున మేటివై వెలసి తీయని దృశ్యప్రబంధముల్ ధరా
తలమునఁ జిమ్మఁగా వెలయు తావక దివ్యయశః ప్రభావముల్
మెలఁకువఁజేసి నీ మృతికి మిక్కిలి కుందెడి మాకుఁ గూర్చె ని
శ్చలమగు నూరడింపు కవిచంద్రమ! లోటులు గల్గకుండఁగన్.

మెల్లఁగా వీచి వేసవి పిల్లగాలి
మేనులకుఁ గూర్చు హాయికి మించి నీదు
ముద్దుకైతలు మా కర్ణపుటములందు
మాఱుమ్రోగవె! సత్కవీ! మధుర మగుచు.

సరస యతులకు స్థానమై బఱఁగెగాదె!
మేలు పదముల జాలుగా మెఱసెగాదె!
నవ్యమాటల కెల్ల గాణాచిగాదె!
నీ కవిత్వంబు నిజముగా నిర్మలాత్మ!

చిరుత కవిత్వముల్ వెలయఁజేయుచుఁ జూపిన లోకమెల్లద
న్మఱిమఱి పోరి మా 'చిలకమర్తి' కవీశ్వర పండితాఢ్యుతో
సరియగునట్టి మేటి కవిచంద్రుఁడు లేడని నీ యశఃప్రభల్
దరమె గణింప నీరసపదంబులు నేర్చిన మమ్ముబోంట్లకున్.

బాలు రెల్లరు విద్యనేర్వఁగ పాఠ్యగ్రంథము లెన్నియో
చాలఁగా రచియించి నాడవు సత్కవీశ్వర! మేటివై
మేలుజేసితి వాంధ్రవాణి కమేయభావము లిచ్చి నిన్
బోలునట్టి కవీశ్వరుం డిల పుట్టఁబోవఁడు సత్కవీ!

మానవ జీవముల్ నిమిషమాత్రము లందురు విజ్ఞు లిట్టిచో
నానని పించుకొంటి వకలంక చరిత్రు డవై ధరాస్థలిన్
పూనిన ప్రజ్ఞతోడఁ గడు ముద్ద్రు ప్రబంధములన్ సృజించి స
న్మానము లందినట్టి కవిమాన్యుఁడ! నీమది శాంతి నొందుతన్.

కపురంపు తావులు గమ్మ గమ్మన జిమ్మ
"కర్పూరమంజరి" కల్గుచుండ
పలుకు పల్కిన ముద్దులొలుకు నీ "సౌందర్య
తిలక"మే తిలకమై వెలయుచుండ
ప్రఖ్యాతమౌ 'గయోపాఖ్యాన' మది నాల్గు
ప్రక్కల వ్యాప్తమై బఱఁగుచుండ
హాస్యాంబుధిని నోలలాడించు నీ 'వినో
దము'ల చాతురి భూమి నమరియుండ

భౌతికశరీర మిందు గన్పట్టకున్న
శాశ్వతముగాదె భవదీయ సద్యశంబు
మొక్కపోవదు నీ కీర్తిపుంజ మెపుడు
'చిలకమర్తి లక్ష్మీనరసింహ' సుకవి!

# ఖడ్గ తిక్కన

విఱిగిన పాలు పోసితివి వెఱ్ఱివి నీ వని తల్లితో నన్
విఱిగెను నీదు శౌర్య మః వీరుల ముందర లేక యున్నచో
మఱలుదువే రణస్థలిని మార్కొన కీ వని తల్లి చెప్పఁగాఁ
దిరిగి రణం బొనర్చి కడతేరవె! నీ దగు మాతృభూమికై.

మంచము నడ్డపెట్టి పలుమాట లిఁ కేటికి స్నాన మాడుమా
యంచు త్వదీయ సాధ్వి తగు హాస్యము లాడగఁ బౌరుషంబుతోఁ
బెంచి శరీరముల్ మిగుల భీకర యుద్ధమునందు శత్రులన్
జించి యలంకరించవె! నశించవి యచ్చర లోక మిచ్చతోన్.

కుత్తకలున్ శరీరములు కూలి సదా ప్రవహించు చుండు పె
న్నెత్తురుటేరు గల్గు కడు నీరస యుద్ధపు భూమి కింతయున్
దత్తరపాటు నందకయు "తల్లి ప్రదేశము" గావు డంచు నా
యత్తముఁ జేసి పంపు హృదయంబులు గల్గెడి మీదు భార్యలన్
మెత్తురు గాదె! మేలనుచు మేదిని గల్గు సమస్తమానవుల్.

పౌరుషమే ప్రధానమగు
భామిను లాదురు మోదు భార్య లీ
సారములేని ముచ్చటల
సంగతిఁ జూడరు లేకయున్న శృం
గారపు కేళిలోఁ గల సు
ఖంబుఁ దలంపక యుద్ధభూమికిన్
గూరిమి నాథులన్ బనుపఁ
గోరుదురే! తమ మాతృభూమికై.

# భరతుని ప్రార్థన

అన్నా! రాఘవ నిన్ను వీడి పురమందా రాజ్యభోగమ్ము లం
దున్నన్ శాంతి యొకించుకేని మదిలో నుండంగఁబోదింతయున్
నిన్నీ కానల కంపుచున్న జననిన్ నిర్మూలమున్ జేతు నీ
కన్నన్ ధర్మముకన్న మిన్నయగునే కైకేయి రామప్రభూ!

తల్లి యటన్న భావనకుఁ దా విడఁబోదు మదీయ మానసం
బెల్ల దహింపఁజేసె నిపు డిట్టి కఠోరపువార్త; యింక నీ
చల్లని ముద్దుమోము గనఁజాల కయోధ్యప్రజల్ వియోగపున్
వెల్లువ లోపలన్ బడి తపించుచు నుండిరి రామభూవరా!

రమ్ము! అయోధ్యకున్ మరలి రమ్ము రఘూత్తమ! వచ్చి నీవు కై
కొమ్ము స్వరాజ్యమున్; జనుల శోకతీర్పుము బంధుకోటి ప్రా
ణమ్ములకన్న నెక్కుడు ఘనమ్ముగ మిమ్ములఁ జూచు; నీ వియో
గమ్ము సహింపఁజాల-దొక గంటయుఁగూడ మదీయసోదరా!

కాంతలు చుట్టునుం గొలువఁగా నెకసక్కెము లాడుకొంచు శు
ద్ధాంతముల నర్జించు సుకృతంబుల ప్రోవగు తల్లి; యిట్టి దు
ర్దాంత వనాళి గ్రుమ్మరు విధంబు నెఱుంగునె? యించుకంత మీ
స్వాంతమునన్ విచార మదిసల్పి ననున్ గరుణింపు మగ్రజా!

తమ్ములు మువ్వురున్ గడుముదమ్మున ధర్మములందు నిల్వఁ బా
దమ్ములు మారుతాత్మజుఁ డుదారగుణాఢ్యుఁడు పట్టి కొల్వ మో
దమ్మగఁ దేవ దుందుభుల ధ్వానము నింగిఁ జెలంగఁ దాము ప
ట్టమ్ము నలంకరింపక కటా! యిటు కానల కేగఁ బాడియే.

# దే శ సే వ

ఆటంకమ్ము ల వేల? మాట లవి యే
లా గట్టిగాఁ బేర్కొనన్
మా 'టంగ్టూరి ప్రకాశ' సింహమునకున్
'బట్టాభికిన్' నీవునున్
దీటౌ వాడవు దేశసేవయెడ గం
ధేభంబుపై నెక్కుటల్
దాటన్ రాని ముదంబు మా కగును సీ
తారామ విద్వత్కవీ!

# శ్రీ పొట్టి శ్రీరాములు గారు

శిబి మేనికండలు చెండి యిచ్చెను గాని
నిన్నుఁ బోలు దీక్ష యాతనికి లేదు
పావురం బది బోయువాని కాకలిఁ దీర్చె
నగడె నన్ను నదిట్టి తెగువగాదు
యజ్ఞంబునకు దేహా మర్పణం బొనరించు
పశుజాతి కిట్టి నిబ్బరము లేదు
రాజర్షుల మటంచు రంభాదుల స్గాను
ముని ప్రముచ్చులకు నిట్టి బుద్ధి లేదు

ఔర! నీ యట్టి యిట్టి కఠోరదీక్షఁ
బట్టి ప్రాణమ్ము బలివెట్టువార్గలారె!
పొట్టి శ్రీరాములయ్యా! ని నోంబలు నట్టి
ఘనులు జన్మింతురే! తెన్గు గడ్డమీఁద!

# ఆగస్టు 15

బంగారమ్ముల తల్లి మాతృజననీ స్వాతం
త్ర్యసంరంభపుణ్
శృంగారమ్మునుగూర్చి విస్తృతముగా
జేగీయమానమ్ముగా
గంగాస్వచ్ఛతరంగమాలికల వే
గం బాష్ప వాగ్ధోరణిన్
రంగాగార లుపన్యసించిరి పుం డీ
రాజిల్లు బెజ్వాడలో.

# ఆంధ్రవాచస్పత్యము

గర్వింతు మయ్యా! నీ కష్టాన ఫలియించి
నట్టివాచస్పత్య మందుకతన
విఱ్ఱవీగుదు మయ్య విఖ్యాతచరితుని
భాషాప్రియుని నిన్నుఁ బడయుకతన
మురిసిపోదుము నిన్నుబోలు విద్వన్మణి
ఆంధ్రావనికి లభ్యమైనకతన
ఉప్పొంగుదుము వాఙ్మయోద్ధారకుఁడ వీవు
మముబోంట్ల కఁడగా మసలుకతన

తెలుఁగుకవులము నిన్ను నుతింతు మయ్య
'కొట్ర' సద్వంశసంభవ కూర్మితోడ
'శ్యామలా కామశాస్త్రి' నా సలుపునట్టి
వందనంబుల నన్నింటి నందుకొనుము.

# కా ను క

సరసాశుకవితావిశారదు లని మిమ్ము
వినుతించినారు కోవిదులు మిగుల
జంటకవిప్రతిష్ఠ సంతరించిన సాధు
లని మిమ్ముఁ బొగడిరి యాంధ్రజనులు
కవితతోఁ గూడిన ఘనులు మీరలె యంచు
గౌరవించిరి గొప్ప ఘనులుగూడ
పండితసభలందు బహుచాకచక్య వి
స్ఫారవాగ్విదు లంచుఁ జాటినారు

మిమ్ము! సోదర కవులార! మిత్రులార!
విపుల సమ్మాన వైభవోపేతులార!
చేరి వినుతింపవశమె యెవ్వారికైన
రమ్యగుణసాద్రు లగు కవిరాజులార!

# పట్టాభి

కట్టా! రాడు తెలుంగు నాయకుఁ డదే కర్మంబో! యిన్నాళ్ళకుం
చట్టిట్టైన తెలుంగు జాతికి మహోహ్లాదంబుగల్పించి; నే
డెట్టో కాంగ్రెసు పీఠ మెక్కితివి వీలే యింక మా జాతికిన్
పట్టాభీ! జయలక్ష్మిఁ గూడి విహరింపన్ బూనుమా వేడ్కతో!

పరువుఁ గణించి లోకమును బాలనఁ జేయఁగఁ జాలు శక్తితో
వరలెడు నీకు పద్యములు వ్రాసి యెటో బులిపించి మిమ్ములన్
బరిచయ మబ్బఁ జేసికొను భావము గా దిది పొంగులెత్తు అ
బ్బురమగు హర్షమే యొలికిపోయె కలంబుననుండి బిట్టుగన్.

ఇపు డధికారము నీయది
నిపుణతతో రాజకార్య నిర్వాహమునం
దెపుడు కనుగలిగి మెలఁగుచు
విపులయశఃకన్యతోడ వెలయుము జగతిన్.

# సుభాస్ బోసు

ఏ దేశభక్తుఁడు ఇంతింత యనరాని
ప్రాభవపటిమ జపాన్కుఁజేరె
నే దేశభక్తుని నెమ్మొగమ్మున నెప్డు
జిరునవ్వు వెన్నెలల్ చెంగళించు
నే దేశభక్తుని హృదయకంజం బెప్డు
మాతృదేశపు ప్రేమభరితమగును
నే దేశభక్తుని నెమ్మనమ్మున దివ్య
భావతరంగముల్ ప్రబలు వట్టి

పూజ్యుఁడగు సుభాస్ చంద్రబోసు మనుమ
బాసి చనె నన్నవార్త దుర్భరమ యగుచు
పత్రికలలోని యిట్టి దుర్వార్త మిగుల
గాసిఁగూర్చెను హృదయము కంప మొంద,

# మల్లేశ్వరా!

శిరమం దెప్పుడు బాలచంద్రుని రుచుల్
చెన్నొంద నీ కెప్పుడున్
సరస న్దా నుమ సేరి ముద్దు నుడుల్
సంతోషమియ్యా న్నిరం
తరముల్ రాముని దివ్యనామమును డెం
దంబందు గీలించి సు
స్థిరభక్తిన్ జపియించుచుందువుగదా
శ్రీశైల మల్లేశ్వరా!

# ప ర దూ ష ణ

ఒకనిన్ దూరుచు తప్పులెన్నుటది యీయుష్మత్స్వభావంబ యూ
రక దూషింతురు దోషమం చెరుగ రో రామయ్యా! నీవుంటి వన్
చిక రొక్కింతయు లేదు; వార లిదియే విఖ్యాతిగా నెంచుచున్
సకిలింతల్ సకిలింతు రయ్యా! భువి లజ్జన్ వీడి రామప్రభూ!

తప్పులు గల్గు చుండు టది తధ్యము నైజము మానవాలికిన్
దప్పగు నీ ప్రపంచమునఁ దా జనియించుట యట్టిచో నొరుల్
తప్పు గలట్టి వారనుట ధర్మమె! యోజన సల్పి యింక నీ
తప్పుడు త్రోవలన్ వదలి ధన్యులు కండని మిమ్ము వేడెదన్.

మీరు వేదాంతు లైనచో మిన్నకుండ
పరము సాధింపఁ జూచుటే బఱఁగు గాని
నొరుల తప్పుల నెన్నుట యొప్పుగాదు
తెలియఁదగు మీకె యిది యేల తెలియ లేదొ!

తప్పు లుండుట సహజమే తలఁచి చూడ
తప్పు లేకుండ నుండు రే ధరణియందు
జన్మ మెత్తుట తప్పు ఈ జగతిలోన
నిలచి గనుఁడయ్య వేదాంత నిపుణులార !

ఎవఁడు విశ్వమయుం డని యెన్న బడెను
ఎవనిలోపల విశ్వంబు యిమిడి యుండె
నెవఁడు దీనులఁ గాచెడి యీశుఁ డట్టి
సర్వమయునకు నందఱు సములు గారె ?

•

# గ్రంథాలయ ప్రబోధం

వేవేల ప్రజలకు విజ్ఞానమును గూర్పఁ
జాలు సాధనము గ్రంథాలయంబు
పరమమూర్ఖుని మహావైజ్ఞానికునిఁ జేయఁ
జాలు సాధనము గ్రంథాలయంబు
భావవ్యాప్తికిఁ దోడుపడి మేలు నొనఁగూర్పఁ
జాలు సాధనము గ్రంథాలయంబు
విద్యార్థులకు బుద్ధి వికసింపఁజేయఁగఁ
జాలుసాధనము గ్రంథాలయంబు

అట్టి గ్రంథాలయంబులకై శ్రమించి
పాటువడుఁ డయ్య భారత వర్షమందు
శాశ్వతంబుగ సత్కీర్తి జగతిలోనఁ
గలుగు తత్సేవవలన మీ కహరహంబు.

చాల హుషారువుట్టెడి ప్రశస్తతరంబగు గ్రంథరాజముల్
కేల నమర్చ నీకుఁ బరికింపఁగ నీ భువి నున్న మేటి గ్రం
థాలయమే శరణ్యముగదా! యటులైన తదీయ సేవకై
జాలముఁ జేయఁగాదగునె! సాఁగుము ముందుకు దీక్షతోడుతన్.

తళుకుఁ జల్కెడు రెండవ తాజమహాలు
బోలు సౌధంబునందేని, పుస్తకంబు
వెలితి యైనచో దయ్యాల నిలయ మనుచు
పలుకరే మున్ను విజ్ఞులై వెలయువారు.

మిత్రుఁడు లేనిలోటును శమింపఁగఁజేసి యనేకమైన చా
రిత్ర విశేషముల్ పలు నరేంద్రుల గాథలు డెందమందు బల్
చిత్రము దోఁపఁగా నెఱుఁగఁ జేసెడి పుస్తకశాలఁగూర్చియే
పత్రికయేనియున్ బహుళవర్ణన సల్పి జయింప నేర్చునే!

గడియ యొకయేడుగా నుండి కష్టపడెడు
మనుజుఁ డీ శాలలోఁ గొంత మసలెనేని
ఘనతరానందవారిధి మునిఁగి తేలి
కల్పముల నెల్ల గడియలో గడపలేడె!

# భ ర త మా త

తెలుఁగుబాసకు మేలు సలిపిన పూజ్యుని
'కృష్ణరాయని' గన్న కీర్తి మాత
గానంబునకు మూలకారణుఁ డైనట్టి
'త్యాగరాయని' గన్న భోగమాత
కాంగ్రెసు పతియైన ఘనుఁడగు వల్లభాయ్
శూరుని గన్నట్టి వీరమాత!
విఖ్యాత భక్త 'కబీరుని' గని యశః
ప్రభలఁ గాంచినయట్టి భరతమాత.

వగచు చున్నది కల్లోల బాధవలన
నుద్ధరింపఁగఁ బూను మయోధ్యరాజ!
రమ్యగుణ సాంద్ర రఘుకుల రామచంద్ర
దాసపోషక శ్రీరామ ధన్యచరిత!

శబ్దశాసనుబోలు సత్కవితతులకు
నునికి పట్టయ్యె నే యుర్వితలము
దమయంతిఁబోలు పూతచరిత్ర సతులకు
పుట్టి నిల్లయ్యె నే పుణ్యభూమి
గాంధి బోలిన మహా ఘనయశులకు నేది
గాణాచి యయ్యె శృంగారముగను
దుర్గావతినిఁ బోలు దోర్బల యువతులు
పుట్టిరే విశుద్ధ భూమియందు

నిట్టి ఘనులకు నిలయమైనట్టి మాత
వగచు చున్నది కల్లోల బాధచేత
రమ్యగుణసాంద్ర రఘుకుల రామచంద్ర
దాసపోషక శ్రీరామ ధన్యచరిత!

బోసి నవ్వులతోడ ముదముఁ గూర్చెడివాఁడు
తేజంబు వెదజల్లు దీప్తివాఁడు
పాత్రి కొల్లాయిచేఁ బరిఢవిల్లెడివాఁడు
గణుతింపఁ దగు గొప్ప గుణమువాఁడు

జనుల యందఱియెడ సమతఁ గల్గెడువాఁడు
ఖద్దరు వలువలు గట్టువాఁడు
స్వాతంత్ర్య రాజ్యంబుఁ బడయఁ గోరెడివాఁడు
'తిలకుని' మెప్పించు పలుకువాఁడు

ఇట్టి గొనములు మూర్తీభవించినట్టి
గాంధిముని మాకు స్వేచ్ఛను కలుగఁజేసె
అట్టి స్వేచ్ఛను రక్షించునట్టి శక్తి
నాయకుల కిమ్ము శ్రీరామ! ఘనంబుగాను.

# సంక్రాంతి

ఈ పేడకలయంపి యెల్ల వాకిళులందుఁ
జిక్కఁగాఁ బఱఁగు విశేషమేమి?
ఈ రంగవల్లిక లీ రీతి నెలకొని
తీయవెన్నెలలు వర్తించు నేమి?
ఈ గొబ్బిదేవత లిమ్మాడ్కి వెలయుచు
భక్తిభావము బయల్పఱచు నేమి?
ఈ గంగిరెద్దు తా నిట్టట్టుఁ దలఁద్రిప్పి
గృహమేధి యశముఁ గీర్తించు నేమి?

బరిణె శిరమున నెలకొన హరిని వొగడు
దాసరన్నలు వేయు తైతక్క లేమి?
సంక్రమణలక్ష్మి దయసేయు సమయ మనుచు
నాంధ్రులకుఁ దెల్పునట్టి చిహ్నంబు లేమొ!

ముక్కలతోడఁ జీఁటి యొడబొండ్లను పా డొనరించు పిట్టల౯
గ్రక్కునఁ బాఱఁద్రోఁలు మన కాపు పడంతివిలాస మిప్పు డీ
చక్కని పౌష్యలక్ష్మి యయి సాఁగె ననంగ వెలుంగుచుండె న
ద్దిక్కులు పచ్చతోరణపు దీధితు లింపెసలారఁ బర్వఁగన్.

పండ్రెండు నెలలుగాఁ బనిసేయఁ దమ తమ
కష్టముల్ ఫలియించు కాల మిదియ
ముక్కాఱు పంటలు పూర్తిగా సమకూరి
గాదెలన్నియు నిండు కాల మిదియ
ఎన్నడో పార్లిన యీ యావుమొదవ పీని
చక్కనయ్యను బెట్టు సమయ మిదియ
పైరు వంకాయలబజ్జితో భుజియించి
మోజుగాఁ దిరిఁగెడు రోజు లివియ

లభ్య మయ్యెను మన కని రైతు జనులు
పొంగుచుండంగ సంక్రాంతి భోగిమంట
లమరె నాంధ్రుల శౌర్య చిహ్నంబు లగుచు
రమ్యతరమైన యట్టి సంక్రమణవేళ.

పైరు చేలలోని బంతిపూవులు గిల్లి
కొప్పునందు బెట్టి కులికె నొక్క-
కలుపుదీయు పడఁతి కాంచి నవ్వుచు రైతు
కూలి నీయఁ ననుచు గోపగించె.

పచ్చఁగా ముగ్గినవి దోసపండ్లు వీని
నేరొ దొంగిలి రెట్లీడ్త్రు యిట్టి దొంగ
పొరుగులో నంచు పాలికె పుంగవుండు
గోల సాఁగించెఁ దా నొక కొంతసేపు.

సంక్రాంతి పండువసమయ మియ్యది యటంచు
బాల బాలికలు సంబ్రాలు పడఁగ
బొమ్మ లన్నియుఁ జేర్చి ముద్దుగుమ్మలు వేడ్క-
దీప ధూపాదులు తీర్చుచుండ
పాలవెల్లులు కట్టి పడు చాడపడుచులు
పుట్టింటఁ గాలము పుచ్చుచుండ
భోగి పండ్లకుఁగాను ముత్తైదువులఁ బిల్చి
చాన లొండొరులతో సరస మాడ

పసపు కుంకుమ జేగురుల్ పస యొనర్ప
సున్నపుంగాతు లెల్లెడఁ జెన్ను మిగుల
వింత చలిగాలి తోలుచు గంతు లిడుచు
ముచ్చటలఁ గొల్పు సంక్రాంతి వచ్చె నిపుడు.

# పటేలు బాబు

హిందూధర్మము నీ కతంబునగదా! హెచ్చైన విశ్రాంతిఁ బా
సందేశ హత్యలు దోపిడీల్ సలుపు టత్యాచారులన్ జూచి నీ
డెందం బెంతయొ గాసినందియొగదా! ఢీకొంటి వవ్వారలఁ
గందర్గోళము లెట్లు సుక్కు నిఁక నాకం బీవు వేంచేసినన్.

గాంధి ఋషి లేని లోటుచేఁ గాసినంది
రంగు చెడియున్నయట్టి బిర్లాలమేడ
నీవు లేకున్న యిఁక పాడుబావి యగును
వేల పల్కులు వీర పటేలు బాబు!

# శ క స మా ప్తి

ఒక చరణం బొకండు మఱియొక్కటి వేఱొకరుండు సెప్పి నా
టికి సెలగించు పండితుల ఢీకొని వాదనసల్పినట్టి యా
సకల కవీంద్ర సన్నుతయశస్కులు 'తిర్పతి వేంకటేశ్వరుల్'
శకము సమాప్తముగా సలిపి శాశ్వతమైన పదంబు నందిరే!

దివమందున్న బృహస్పతీసముఁడు వాగ్దేవీ కృపాసంయుత
స్తవనీయాంచిత సద్యశుండు విలసత్సాహిత్య వారాశి ని
క్కువ మీయాంధ్రులభాగధేయమిఁకవాక్కుల్ మానదిక్కున్నదే
కవితా కన్యకు "నాంధ్ర భారతికి" లోకంబందు కామేశ్వరీ!

గోచియుఁ బెట్టుకున్నపుడె కోమలమైన కవిత్వగోష్ఠి వి
ద్యా చతురత్వ మొప్పెడివిధంబున సర్వకవీంద్రకోటి యా
హాచతురత్వ మిట్టిదని యచ్చెరువొంద రచించు సత్కవిన్
దాచెన? కాలవాహిని సదా కవితాసతి మూఁగవాఱఁగన్.

కవినై పుట్టితి నంచుఁ జాటితివి ఘంటాగొట్టి కామేశ్వరీ
స్తవమున్ జేసి తదీయ దేవతకటాక్షశ్రీలకున్ బాత్రుఁగా
భవ మద్దాన తరింపఁజేసితివి పూర్వాచారమై వచ్చు ఆ
స్తవముల్ సెల్లెనె! వేంకటేశ కవిచంద్రా! నా నమోవాకముల్.

ప్రథమాస్థాన కవీంద్రుఁ జేసిన ప్రభుత్వం బెంతో చింతింప నీ
కథలన్ గానముఁజేయు శిష్యులిఁక వాగ్వ్యాపార సంపత్తిలో
పథికుల్ గాఁగ సమస్తమున్ విడిచి సాపాటిన్ గనన్ గోరి మా
పృథివిన్ వీడి ప్రయాణమైతి విఁక దేవీ దర్శనోత్సాహివై.

# బాపూజీ లేడా!

ఐదుఖండాలకు నాదిమూర్తి యటన్న
తేజోమయుఁడు నేఁటి దినము లేడు
సత్యమూర్తి యటంచు జనులు వాకొను దివ్య
మహిమాన్వితుడు నేఁడు మనకు లేడు
స్వాతంత్ర్యమున కాత్మ బలమెల్ల వెచ్చించి
వినుతి కెక్కినయట్టి విభుఁడు లేడు
దిగ్దిగంతములందు దివ్యవాగ్ఝరులను
ప్రవహింపఁజేసెడి ప్రభువు లేడు

అనుచుఁ గశినంపు రేడియో లవనియందు
క్రూరమగు నిట్టివార్త వాకొనఁగఁ దొడఁగె
శాంత మను చక్రమున జగజ్జయముఁ గొన్న
గాంధిదేవుఁడు మృతిని దాఁ గాంచు టెట్లు!

ముప్పది మూఁడుకోటులకు పూజ్యుడు గాంధి మహాత్ము డన్న నీ
త్రుప్పు తుపాకిదెబ్బలకు దుందుడుకందు టదెట్లు? మిథ్యయా
తప్పుడు వార్తగాని యిది తథ్యముగాదని తోఁచు సయ్యయో
గుప్పు మనెన్ ప్రపంచమున క్రూరపువార్త యిఁకేమి యయ్యెడిన్.

భౌతిక శరీరమును భంగపరచియుండు
గాని యీ దేవు నాత్మను గాల్చుటన్న
బాంబులకు గాదు వాని యబ్బలకు నైన
సాధ్యమగునట్టి పనిగాదు జగతియందు.

# క వి బ్ర హ్మ

నీ కావ్యామృత సారమేగద! త్రివేణీరూపమై తెల్గునన్
బ్రాకాడన్ దొరకొన్న దీపయిన దీవ్యద్వైభవోపేత గం
గా కల్లోలవతీప్రవాహ భరవేగప్రక్రియన్ బొల్పుచున్
ఓ కవ్యగ్రణి నీదు కైత వెలుఁగొందున్ నర్సయ గ్రామణీ!

జీవమ్ముగల కైత సృష్టించి ముంగల
బాటఁ జూపినది మా "ఏటుకూరి"
శృంగారమగు క్షేత్ర జీవనమ్మును తెల్గు
నాఁటఁ నాటినది మా "ఏటుకూరి"
తెలుఁగు వెల్గునకుగా నిలువెల్ల వెచ్చించి
రాటుదేలినది మా "ఏటుకూరి"
సమకాలికోన్నత సాహిత్య వనములో
పాటఁ బాడినది మా "ఏటుకూరి"

యొనెడి హర్షానఁ బొంగి మీ యాంధ్ర జనులు
సలుపు సన్మానమున కెద సంతసించెఁ
బంపుచున్నాఁడఁ దోఁచిన పద్యములను
అందుకొను మయ్య సుకవి సఖ్యము దలిర్ప.

"నాయకురాలి" దర్శనమునన్ బులకించిన భావ మింక; ఆ
చాయకుఁ బోయి హాళికుల చానల చేష్టల కుబ్బి దివ్యహా
హాయి గడించి, మించి సుఖమంది "త్రివేణి" జలాన బృంగి దా
నూయెల లూఁగె స్వేచ్ఛగ మహోజ్జ్వల వీరకథావగాహియై.

కుకవి మత్తేభముల గుండె క్రుసుమ్మనట్టి
భయద కవిసింహముల కాటపట్టుగాఁగ
వఱలు పలనాట మీ సభ జరుగునన్న
పల్కు లవి గూర్చె నాకు నపారముదము.

కవుల చరితంబునందు నీ ఘనచరిత్ర
ఏటుకూరి కవీంద్ర వర్ధిలును గాక
మధుర మంజుల మార్దవమైన కథలు
వెలువడును గాక యింక నీ కలమునుండి.

# ఆంధ్రకేసరి

తెలుఁగుప్రజల్ రమేశుని నుతించిన పూర్వఫలంబుచేతనే
తెలుఁగున రాష్ట్రపాలన కధీశుఁడ వైతివి నీవు మాకు మా
తెలుఁగుకళల్ భవాదృశుల ధీగరిమంబునఁ జేసి పూర్వముం
గల విభవంబులం దిరిగి. కాంచవె! రాష్ట్ర ప్రధాననాయకా!

కవులము మేము ఎట్టి యధికారుల కైనను జంకి ముందుగా
నవు నని కల్ల బొల్లి విషయమ్ములఁ బల్కఁగఁబోము; యింక నీ
ప్రవిమలకీర్తి మా చెవులపండువు జేయుకతాన నీపయిం
గవిత లిఖించినాఁడ నిది గైకొనుమయ్య ప్రధానిశేఖరా!

పరులగు నాంగ్లపుం దొరలు పాలనఁజేసెడి వేళ, వారి ముం
దర తమ మంచిచెడ్డల విధం బెఱిఁగింపఁగ రాదు. లాయరే
యరుగఁగ వారి సన్నిధికి నర్హుఁడు నన్యులు కారటందు రీ
సరికి త్వదీయపాలనము సాఁగఁగ మా కిఁక లోటుగల్గునే!

దేశము నుద్ధరింపఁ బరదేశదొరల్ మము నేలకుండ; సం
తోసముతోడ బెక్కులగు దుర్ఘటముల్ సహియించి జైలులో
వాసముఁజేసియుఁగా తుదకుఁ బంతముతోడుత పాలకుండవై
కేసరి యన్న మేటిదగు కీర్తిని వన్నెకుఁ దెచ్చినావుగా.

సరసుఁడు 'చిల్కమర్తి కవిచంద్రుఁడు' తావకమిత్రుఁ డన్న ని
ర్భరమగు నీ కవిత్వపరిపాలన దీక్ష ప్రశంసనీయమౌ
గరువముతోడ నాంధ్రులు ప్రకాశ ప్రధానికి 'జై'యటంచు నా
దరమగు భక్తితోడ వినతాంజలు లిరె ప్రధానిశేఖరా!

స్తోత్రియుతుండవై మిగుల సుందరమౌనటు నీవు ద్రౌపదీ
పాత్రి ధరించి ప్రేక్షకుల పాత్రతఁగంటె వటన్న యింక నీ
గాత్రము పూర్వపున్గళల గౌరవ మెన్నగఁ శక్యమౌనె! ఏ
మాత్రము సంశయింపక సమాజము మెచ్చదె! నాఁడు మిమ్ములన్.

# భా షో ద్ధా ర కు లు

శ్రీ విశ్వేశ్వరుఁ డెల్ల కాలము కృపాసింధుండునై తాను వి
ద్యా వైశద్యముగల్గు వానిని మహాధర్మాత్మునిన్ భాషకున్
సేవల్ సల్పు ఘనున్ సుకీర్తి జగతిన్ చేకొన్న ధీశాలినిన్
'వావిళ్లాన్వయ వెంకటేశ్వర' బుధున్ వర్ధిల్లఁగాఁ జేయుతన్.

వర సారస్వత గ్రంథరాజముల సేవాసక్త చిత్తంబుతో
నిరతంబున్ మన తెల్గు సత్కళలకున్ నీరాజనం బిచ్చుచున్
వర వావిళ్ళ కులాబ్ధిచంద్రుఁ డయి దా వర్ధిల్లు మా వేంకటే
శ్వరు 'షష్ట్యబ్దపుటుత్సవంబు' మదికిన్ సంతోషమున్ గూర్చెడిన్

'మను చరిత్రే'త్యాది ఘన గ్రంథముల టీక
వెలయఁజేసినది వావిళ్ళవారు
సంస్కృతాంధ్రము లందు సద్గ్రంథ రాజముల్
వెలువరించినది వావిళ్ళవారు

బహువిధ పాండితీ ప్రావీణ్యమున కెల్ల
పేరు చెందినది వావిళ్ళవారు
వ్యాప్తిగన్న త్రిలిఙ్గ పత్రికనాథులై
వినుతి కెక్కినది వావిళ్ళవారు

అనుచు నాంధ్రులు మిముఁ గొనియాడు చుంట
నరసినాడను వెంకటేశ్వర సుధీంద్ర
షష్టి పూర్త్యుత్సవము మీకు జరుగు నంచు
వినఁగ డెందాన హర్షము వెల్లివిరిసె.

అందము చిందు గ్రంథముల నన్నిటి నచ్చు లొనర్చి మీదు దై
వందిన జీవితంబును ఘనంబగు నాంధ్ర వధూటిసేవకై
పొందుగ వెచ్చబెట్టు పరిపూర్ణకళానిధి వైతి వింక మా
డెందము లెల్ల మీరలు గడించిన కీర్తికిఁ బొంగిపోయెడిన్.

ఆ కాలంబున పూర్వపు న్గవులు దా మట్టిట్టు గంటాలచే
పీకన్వ్రాసిన శాస్త్రగ్రంథములు వేవేలుండ నన్నింటికిన్
టీకల్ వ్రాసియు ముద్రణన్ సలిపి పాండిత్య ప్రధానంబుగా
నీ కాలంబున వ్యాప్తి సల్పునది మీరేగాదె! విద్వన్మణీ!

# క వి ప్ర శం స

భేషు! సెబా సటంచు కవిపెద్దలు మెచ్చులు చూపుచుండఁగా
జాషువ! నీదు మేఁల్మియిత చాయలుజూచి తెలుంగువారు మం
త్రౌషధబద్ధు లౌనటు లహా! యొఁనరించితి విట్టి చిత్రమౌ
యోషధిబోలు కైత లెటులొప్పెను నీకు కవీంద్రశేఖరా!

అబ్బుర మందినారుగద! ఆంధ్ర మహాజనులెల్ల నీదు మే
లబ్బుల రాయబారకథ గన్గొనినంతనె యింక మాకు త
బ్బిబ్బు ఘటిల్లె నేఁటి కవిబృందమునందున నీదు కూరుపుల్
అబ్బునె! నీకుఁ దప్ప మఱి యన్యుల కో కవితావిశారదా !

ముదమందినారు నీ ముద్దుకావ్యాలందు
గల పద్దెములఁజూచి తెలుఁగు కవులు
సంతసించిరి సర్వసజ్జనావళి నీదు
కూర్పులోఁ గలయట్టి నేర్పు నరసి

నుతియించినారు నీ వితతవాగ్విభవంబు
పండితు లంచుఁ బేర్వడయువారు
మెచ్చుఁజూపిరి నీకు మేటిపత్రికలనుఁ
బ్రకటించునట్టి సంపాదకులును

ఆంధ్రదేశమ! నీకు జోహారు లిడను
చెళ్ళపిళ్ళ కవీంద్రుఁడు చెప్పినట్లు
'జాషువా' నీ యదృష్టము భేషు నీకుఁ
'గనక వర్షాభిషేకము' కలిగెనయ్య.

# ఉగాది

ఈ యుగాదికె సుమీ! యిగురుమామిడి నెక్కి
గండుకోయిల రాగగరిమఁ జూపు
ఈ యుగాదికె సుమీ! యిండ్ల వాకిళులందు
క్రొత్త ముగ్గుల సౌరు గుప్పుమ్మరించు
ఈ యుగాదికె సుమీ! యింటింటఁ బచ్చని
తోరణపంక్తులు వ్రేఁగుచుండు
ఈ యుగాదికె సుమీ! యెండుటాకులు వాసి
తరులెల్ల చిగురుసంతతుల గనును

ఈ యుగాదికె కద! భూము లేలు రాజు
మొదలు పేదకు సైతము ముదము గలుగు
కవుల కెల్లను భావనాకాశమందు
ఈ యుగాదికె కద! ఊహ లిగురు లొత్తు.

# న్యాయమూర్తి

శ్రీమద్దివ్య భవత్పదాబ్జవిభవశ్రీ నెన్నఁగా నెమ్మితో
నే మూఢాత్ముఁడ నయ్యు నీ చరణమం దీ పద్యపుష్పంబులన్
బ్రేమన్ బూని 'సమర్పణం బనుచు' నర్పింపంగ నూహించితిన్
'సోమయ్యా!' గుణోగదయ్యా యశముల్ శోభిల్ల నెల్లప్పుడున్.

నీ కీర్తిప్రభ లీ ధరాతలముపై నిత్యంబులై క్రాలుతన్
నీకౌగాక శుభంబు లెల్లపుడు నెంతే నిన్ను సత్ప్రీతితో
లోకాధీశుఁడు రామచంద్రుఁ డొగి మేలున్ గూర్చి రక్షించి యు
ష్లోకైశ్వర్యయుతున్ బొనర్చుతను సుశ్లోకుండవై యొప్పటన్.

ఇల సత్ప్రీతి సమస్తమానవుల దా వేమారు సృష్టించి క
ర్మలచే వారికిఁ గల్గు కష్టములఁ బారందోలి యీరీతి దా
నెలమిన్ నాటకమాడిచున్ బదఁపడిన్ సృష్టిన్ లయంబొనటుల్
పాలియం జేయు గుణుండు నిర్గుణుడు మేలుంగూర్చినిన్నెమ్మితన్.

ఘనమైన న్యాయాధికారత్వమందున
'ముత్తు సామయ్యరు' బోలువాడ
ధర్మసూక్ష్మముల విధం బెఱింగెడిపట్ల
ధర్మరాజునుబోలి దనరువాడ
మదరాసు కోర్టు ధర్మాధికారులలోన
ప్రథమాన కీర్తిచే బఱఁగువాఁడ
శాంతమూర్తి వటన్న సద్యశంబున కీవు
నసమానకీర్తిచే నెసఁగువాఁడ

పూర్వు లిచ్చిన యీనాము భూములెల్లఁ
దిరిగి పోషించు దీక్షచే మెఱయువాఁడ
సోమయార్యుఁడ! నీ కెప్డు శుభము లొసఁగి
ఓముగావుత! నా మనోధాము డెపుడు,

అతిశయ మైనయట్టి విషయం బిదిగాదు మహాగుణాఢ్య నీ
యతులిత శేముషీవిభవమంతయు వర్ణనఁజేయుపట్ల ధీ
మతులగువార లెక్కు డసమర్థు లటన్నచొ నాకు సాధ్యమే
కుతుకముతోడ నీపయిని గూర్చితి నిట్టివి స్వల్పపద్యముల్.

తీర్పును జెప్పునప్డు భవదీ
యహృదిన్ గల భావ మెంతగా
నేర్పు వహించునో యెఱుఁగ
నేరను న్యాయ్యమె యున్నరీతిగా
నేర్పడు తీర్పుపత్త్రమున నింకొకరీతిగ
నుండఁబోదు నీ
తీర్పుకు సంతసింపఁడో మదిన్ బహు
భంగుల దేవమంత్రియున్.

# హిందూ సుందరి

హిందూదేశపు టాంధ్రభాషకును వన్నెందెచ్చి పోషించి యా
నందం బౌనటు వారి వారికిని నానాసంగతుల్ తెల్పుచున్
డెందం బందు ముదంబుఁగూర్చి ఘనపాండిత్యంబు గై సేయు నీ
"హిందూసుందరి" వృద్ధిగాంచుగద నెంతే రక్తి రామప్రభూ!

భగవంతుండవు నీకుఁ జోటిడద యీ పాపంపు కాలంబునన్
దగు చోటిచ్చెను 'హిందు సుందరి' మహాధన్యాత్మ నీ కిప్పుడున్
మొగమాటంబుగ దీని గాచుటె కదున్ ముఖ్యంబు లేకున్నచో
నగుబాటేగద నీదు శక్తి భువిలో నాతండ్రి రామప్రభూ!

కల లెల్లన్ నశియించు నిక్కలిని దా గంభీరమై ముఖ్యమై
కలలన్ బోషణఁజేయు వృత్తములకున్ గాణాచియై కీర్తికి
న్నిలయంబై రసవాక్యగుంభితమునై నిర్దుష్టమై యొప్పు దా
గలకాలంబును 'హిందు సుందరి' యనన్ గాపాడు రామప్రభూ!

# ప్రకృతి ప్రశంస

వాడ వాడల ప్రకృతి మేల్ వైద్య మొసఁగు
నట్టు పత్రిక నడుపు ధన్యాత్ముఁ డింక
యోగ విద్యావిశారదుఁ డుత్తమోత్త
ముండు అవధూతమణి – సజ్జనుండు జగతి.

ఏనుతింపందగు లోకసేవ యిది భావింపంగ నేఁ డిట్టి మేల్
పనిచే సర్వజగత్తు సౌఖ్యముల దై వారుచుంగదా యెందఱో
ఘనుతా వారలె పాడురోగములచేఁ గష్టాలపాలైరి; మా
తను వృష్టాంగెడి నమ్మ! యిట్టిఘనవైద్య ప్రక్రియల్ దూచుటన్.

ఘోరరుజార్తులౌ జనులు కోరరు సొమ్మదిలోన ద్రవ్యముల్
కోరరు; దివ్యభోగములు కోరగలేరు మణీవితానముల్
కోర రవెట్టి యింక నొక కోరిక; రోగవిముక్తు లౌటయే
కోరుదు రట్టిభాగ్యమును గూర్చెడి నీకు నమస్సు లమ్మరో!

# మిష్టర్ వేపా

ఏ పాపం బది చుట్టుకొన్నయది నేఁ
డీ యాంధ్రదేశాని కె
న్నో పాటుల్ గుమిగూడఁగాఁదొడఁగెన
య్యో! మాదు డెల్టా నొగి
న్గాపాడన్ గమకించి తెన్గుదొర ప్రా
ణత్యాగముఁ జేసెఁగా
'వేపావంశ్యుఁడు కృష్ణమూర్తి' భువి ని
ర్వీర్యంబై యున్నాళ్ళకున్.

•

